# ఆంధ్రప్రదేశ్

సంపుటి: 14 | మే-జూన్ 1970 | సంచికలు 7,8

వైశాఖ-జ్యేష్ఠ-ఆషాఢ 1892 శా.శ.

ప్రధాన సంపాదకుడు : పెండ్యాల వామనరావు




ముఖచిత్రం : పద్మాకరమ్
రెండవ అట్ట : హార్స్లీకొండ దృశ్యం
చివరి అట్ట : వాతావరణ పరిశీలనకై వదలిన బెలూను.
[శ్రీధర్ ప్రెస్ ఫొటో సర్వీస్]

వెల: 50 పైసలు
సాలుచందా ఆరు రూపాయలు
**Regd. No. H. 135.**

ఈ సంచికలో
రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు
తప్పని సరిగా
ప్రభుత్వానికి సంబంధించినవిగా భావించనక్కరలేదు.

# ఉజ్వల భవిష్యత్తు కోసం ఉక్కు పరిశ్రమ

గడచిన సంవత్సరం రాష్ట్రంలో ఒకచోట వరదలు, ఇంకొకచోట కరువు, మరొకచోట ఆందోళనవల్ల ఆర్థిక వ్యవస్థకు తాత్కాలికంగా అవరోధం కలిగినప్పటికీ, మొత్తంమీద ఆంధ్ర ప్రదేశ్ ప్రగతిపథంలో పురోగమిస్తూనే వుంది. విశాఖ పట్టణంలో ఒక ఉక్కు కర్మాగారాన్ని నెలకొల్పాలని కేంద్ర ప్రభుత్వం చేసిన నిర్ణయం రాష్ట్ర అభివృద్ధిలో అత్యంత ప్రధానమైన ఘట్టం. ప్రజలు ఏకగ్రీవంగానూ, శక్తివంతంగానూ వెలిబుచ్చిన చిరకాల వాంఛితం దీనితో యీడేరింది. పారిశ్రామిక, ఆర్థిక రంగాలలో అభివృద్ధికి ఉక్కు, విద్యుచ్ఛక్తి కీలకమైనట్టివి. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి విషయంలో స్థాపిత యంత్ర శక్తిని పెంచుకోడానికి రాష్ట్రం చేస్తున్న కృషి ఫలప్రదం అవుతున్నది. కాని పెరిగిపోతున్న గిరాకీని తట్టుకోవాలంటే, పనులు యింకా త్వరితంగా చేసుకోవడం, కొత్త పథకాలు చేపట్టడం అవసరం. ఉక్కు కర్మాగార స్థాపనవల్ల చెప్పుకోదగినంతగా ఉద్యోగావకాశాలు పెరగడమే కాకుండా విశాఖపట్టణ నగర స్వరూపం పూర్తిగా మారి అదొక గొప్ప పారిశ్రామిక ప్రాంతంగా అభివృద్ధి చెందుతుంది. ఈ దృష్ట్యా చూచినట్లయితే రాజమండ్రి నుండి విశాఖపట్టణానికి గోదావరి జలాలను మళ్ళించాలనే ప్రతిపాదనకు ఎంతో ప్రాముఖ్యం ఉంటుంది. విశాఖపట్టణం ఇంకా అభివృద్ధి చెందడానికి. తమిళనాడులో మద్రాసులాగా ఆంధ్రప్రదేశ్‌లో ప్రాధాన్యం వహిచండానికి యీ ప్రతిపాదన దోహదం చేస్తుంది.

ఏప్రిల్ నెలలో మరి రెండు ప్రధానమైన సంఘటనలుకూడా జరిగాయి, ధవళేశ్వరం దగ్గర గోదావరి ఆనకట్టకు 150 అడుగుల ఎగువన కొత్తగా నిర్మించదలచిన బ్యారేజికి శంకుస్థాపన జరిగింది. అలాగే వెనుకబడిన ప్రాంతమైన శ్రీకాకుళం జిల్లాలో గొట్టవద్ద వంశధార ప్రాజెక్టుకుకూడా శంకుస్థాపన జరిగింది. గోదావరి జలాలను పొలాలకు మళ్ళించి డెల్టా ప్రాంత ప్రజల సుఖ జీవనానికి దారులువేసిన ప్రతిభావంతుడైన సర్ ఆర్థర్ కాటన్‌కు కృతజ్ఞతా సూచకంగా, కొత్తగా నిర్మించదలచిన బ్యారేజికి ప్రజలు ఆయన పేరే పెట్టుకున్నారు. పురాతన ఋషులవలె కుటీరవాసంచేస్తూ, ఆయకట్టు సర్వే చేయడానికి మైళ్ళకుమైళ్ళు నడిచిన నిరాడంబరుడు సర్ ఆర్థర్ కాటన్‌ను మన ఇంజనీర్లు ఆదర్శంగా తీసుకోవాలని కేంద్ర నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖ మంత్రి డా. కె. యల్ రావు యీ సందర్భంలో ఉద్బోధించారు.

గొట్టవద్ద నిర్మించదలచిన కొత్త ప్రాజెక్టు శంకుస్థాపనోత్సవం తిలకించడానికీ ముఖ్యమంత్రి సందేశం వినడానికీ, తమ సాంప్రదాయిక దుస్తులు ధరించి వేలాది గిరిజన స్త్రీ, పురుషులు వచ్చారు. వర్షం జోరున కురుస్తున్నా, శ్రీ బ్రహ్మానంద రెడ్డి గారిని చూడడానికి గిరిజన స్త్రీలు చాలా దూరం 'క్యూ' లలో నిలబడి వేచి వున్న దృశ్యం గమనించదగినట్టిది. సంఘ వ్యతిరేక శక్తుల ప్రభావానికి లోనవుతున్న గిరిజనుల పరిస్థితులను మెరుగుపరచడానికి ప్రభుత్వం గట్టి చర్యలు తీసుకుంటుందనీ గిరిజనులకు అప్పులు ఇవ్వడానికి రు. 24 లక్షల నిధిని ఏర్పాటు చేస్తున్నామనీ ఆయన చేసిన ప్రకటన వినగానే గిరిజన ప్రజాసమూహంలోనుండి హర్ష ధ్వానాలు మిన్నుముట్టాయి.

మహాపురుషుడు. ఆధునిక రష్యా నిర్మాత, లెనిన్ శతదినోత్సవం ఆంధ్రప్రదేశ్‌లో ఏప్రిల్ 22వ తేదీన జరిగింది. అటు లెనిన్, ఇటు గాంధీజీ యిద్దరూ ప్రపంచ ప్రసిద్ధిచెందిన మహాపురుషులు. తమ ఆదర్శాలకు అనుగుణంగా చరిత్రగతిని మార్చిన, మానవజాతి లక్ష్యాలను పునర్నిర్మించిన మహా విప్లవయోధులు,

పి. వి. ఆర్

# వంశధార ప్రాజెక్టు

## వంశధార నది:

వంశధార ఆంధ్ర ప్రదేశ్ లోని పెద్ద నదుల్లో నాలుగవది. ఇది ఒరిస్సా రాష్ట్రంలోని కోరాపుట్ జిల్లాలో గల జైపూర్ జమీందారీ లోని బిస్సం–కటక్ తాలూకాలో ఉత్తర దిశ వైపుగల తూర్పు కనుమల్లో పుట్టి, ఒరిస్సా రాష్ట్రం లోని కోరాపుట్ జిల్లా, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం లోని శ్రీకాకుళం జిల్లాల్లో నుంచి 160 మైళ్ల దూరం ప్రవహించి మొత్తం 4,160 చ. మైళ్ల నుండి పారిన నీటితో కళింగ పట్నం వద్ద బంగాళా ఖాతంలో కలుస్తున్నది. 4,160 చ. మైళ్లలో 3,500 చ. మైళ్లు ఒరిస్సా రాష్ట్రం లోనూ, 660 చ. మైళ్ళు ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం లోనూ వున్నాయి. నైరుతి ఋతు పవనాల వల్లా, ఈశాన్య ఋతు పవనాల వల్లా యిక్కడ 47 అం., ల వర్ష పాతం వుంటుంది. నది జనన ప్రాంతంలో కొండ చరియలు నిటారుగా వుండి ఆ తరువాత మైదాన ప్రాంతం సమతలంగా వున్న కారణం చేత అతి తక్కువ వ్యవధిలోనే వంశధార నదికి తరచుగా వరదలు వస్తూ వుంటాయి.

## వంశధార బేసిన్

ఉత్తర దిశన ఒరిస్సా రాష్ట్రంలోని మహానది బేసిన్‌కు, ఈశాన్య దిశన ఋషి కుల్య (బేసిన్‌కు,)పశ్చిమాన నాగావళి, లేదా లాంగుల్య బేసిన్‌కు, తూర్పున బంగాళ ఖాతానికి మధ్య యీ వంశధార పరీ వాహక ప్రాంతం (బేసిన్) వుంది. ఇక్కడి కొండలు చాలా నిటారుగా వుండి ఎగుడు దిగుడులతో కూడుకొని యించు మించు వాయువ్యం ఆగ్నేయం దిశలుగా విస్తరించి వున్నాయి. వంశధార పరీ వాహక ప్రాంతం నది జన్మస్థలం నించి బత్తిలి అనే గ్రామం వరకు దగ్గర దగ్గర 50 మైళ్ల వెడల్పు కలిగి వుంది. ఆ తర్వాత హీర మండలం వరకు సుమారు 15 మైళ్ల వెడల్పు కలిగి వుంది. వంశధార పుట్టిన చోటు నుండి కళింగ పట్నం వద్ద



గొట్టా బ్యారేజి వద్ద నది దృశ్యం

బంగాళా ఖాతంలో సముద్రంలో కలిసేవరకు దీని మొత్తం పొడవు 160 మైళ్లు. ఈ నది పుట్టిన ప్రాంతం మొదలుకొని బత్తిలి గ్రామం వరకు దీనికి అనేక ఉప నదులు వచ్చి చేరు తాయి. అయితే యిక్కడి నుంచి దిగువ కలిసే ముఖ్య ఉప నదుల్లో ప్రధాన మైనది మహేంద్ర తనయ నది. ఈ మహేంద్ర తనయ నది పర్లాకిమిడికి ప్రక్కగా ప్రవహించి గొట్టా గ్రామానికి ఎగువ 3 మైళ్ల దూరంలో వంశధారను ఎడమ వైపు నుంచి వచ్చి కలుస్తుంది. గొట్టా బారేజి ప్రాంతానికి ఎగువన యీ నది పరీ వాహక ప్రాంతం 3,757 చ. మైళ్లు. నేరడి గ్రామానికి ఎగువన మరో బారేజి నిర్మించ దలచారు. అక్కడ పరీ వాహక ప్రాంతం 3,050 చ. మైళ్లు వుంటుంది.

## వంశధార ప్రాజెక్టు ఆవశ్యకత

ఈ ప్రాంతం చరిత్రని చూస్తే తరచుగా యిక్కడ కరువు ఏర్పడు తున్నట్టు వెల్లడవు తుంది. అందు వల్ల యీ ప్రాంతంలో కరువు నివారణ చర్యలను చేపట్ట వలసిన అవసరం ఏర్పడింది. 1888 సంవత్సరములో గంజాం జిల్లాలో అతి భయంకర మైన కరువు ఏర్పడింది. పంటలు పూర్తిగా దెబ్బ తిన్నాయి. అందు వల్లనే 1889లో పెద్ద ఎత్తున కరువు నివారణ చర్యలు చేపట్టడం జరిగింది. మళ్లీ 1896–97లో దత్త మండ లాలైన కర్నూలు, కడప, అనంతపురం జిల్లాల లోను బళ్లారి లోను కరువు ఏర్పడి నప్పుడు గంజాం జిల్లాలో కూడా (ఈ గంజాం జిల్లా నుండే 1950 లో యీ నాటి శ్రీ కాకుళం జిల్లా వేర్పరచ బడింది.) కాటక పరిస్థితులు ఏర్పడ్డాయి. నైఋతి ఋతు పవనాలు సరిగా వీచని కారణం చేతా, ఈశాన్య ఋతు పవనాలు పూర్తిగా విఫలం కావడం చేతా యీ కరువు పరిస్థితి ఏర్పడి గంజాం, శ్రీకాకుళం జిల్లాలను బాగా దెబ్బ తీసింది. మళ్లీ 1919 సంవత్సరాంతములోనూ 1920 లోనూ తిరిగి గంజాం జిల్లా కరువుకు గురయింది. 1942 లో ఇచ్ఛాపురం, సోంపేట, టెక్కలి తాలూకాలలో కరువు నిరోధక చర్యలు చేపట్ట బడ్డాయి. 1944 లో కూడా కరువు పరిస్థితులను ఎదుర్కో డానికి పి. డబ్ల్యు. డి. ప్రత్యేక విభాగం ప్రారంభించ బడింది. 1942 నుంచి 1946 వరకు నిరంతరంగా కరువు పనులు కొన సాగుతూనే వున్నాయి. చాలా కాలంగా తరచుగా కరువు కాట కాలకు గురి అవుతూ వున్న ప్రాంతం ఆంధ్ర ప్రదేశ్‌లో శ్రీ కాకుళం జిల్లా అని చెప్ప వచ్చు.

## లోగడచేసిన ప్రతిపాదనలు

వంశధార నది నుంచి ఉపయోగిస్తున్న నీరు చాలా తక్కువే అదిన్నీ ఏటి కాలువల ద్వారానే వినియోగించ బడుతోంది. ఈ నది నుండి దాదాపు 50,000 ఎకరాలకు మాత్రమే సేద్యపు నీటిని అందించడం జరుగుతోంది. ఇంతకన్న ఎక్కువ జలాలను వినియోగంలోకి తీసుకు రావడానికై గత నూరు సంవత్సరాలుగా ప్రతి పాదనలు పరిశీలించ బడుతూనే వున్నాయి.

వర్షాలు పడినప్పుడు యీ నదిలోని నీటిని సేద్యానికి మళ్ళించే



ఏప్రెల్ 1వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గొట్టా బ్యారేజికి శంకుస్థాపన చేశారు.

నిమిత్తం వంశధార మీద ఆనకట్టను నిర్మించాలని ఆదిలో ఉద్దే శించారు. గొట్టా గ్రామం దగ్గర వంశధారమీద ఆనకట్ట నిర్మాణం ఆ పథకానికి సంబంధించినదే. ఆనాటి అవిభక్త మద్రాసు ప్రభుత్వం యీ పథకాన్ని మంజూరుచేసే విషయమై చాలాసార్లు—అంటే 1854, 1866, 1892, 1912, 1920 లలో పరిశీ లించడం జరిగింది. అయితే యీ ప్రాంతంలోని జమీందార్లు అంతగా సహకరించని కారణంచేత యీ పథకాన్ని మంజూరుచేయ డం జరగలేదు. జమీందారీలు రద్దు అయిన తర్వాత సమగ్ర వంశధార ప్రాజెక్టుకు సంబంధించిన ప్రతిపాదనలు మళ్లీ వెలుగు లోకి వచ్చాయి. ఈ పథకానికి సంబంధించిన పూర్తి పరిశీలన లను చేపట్టడం జరిగింది. ఈ సమగ్ర పరిశీలనలవల్ల ఇక్కడ కేవలం ఒక ఆనకట్ట కట్టినంత మాత్రాన యీ నదీజలాలను పూర్తిగా వినియోగించుకోవడానికి గానీ, యీ ప్రాంతాన్ని అభివృద్ధి పరచడానికి గానీ వీలు కలుగదని తెలిసింది. ఎందువల్లనంటే మళ్ళింపు పథకంద్వారా యీ నదిలో లభ్యమయ్యే జలాలవల్ల కొద్ది పాటి భూములకే సాగునీరు లభిస్తుంది. అందువల్ల నదిలో నీటిని ఎక్కువగా వినియోగించుకోవాలంటే మళ్లింపు పథకం కాక నీటి నిలువ పథకాన్ని చేపట్టవలసి వుంటుంది. తదనుగుణముగా రిజ ర్వాయరును నిర్మించడానికై అనేక ప్రత్యామ్నాయ ప్రాంతాలను పరిశీలించడం జరిగింది. ఇందుకు ఒరిస్సా ప్రభుత్వ అనుమతి పొందడానికిగాను ఆ ప్రభుత్వముతో సంప్రదింపులు కూడా జరిగాయి. ఇంతవరకు పరిశీలించిన ప్రాంతాలను యీ దిగువ పేర్కొనడమైనది.

(1) సింగిడి
(2) మదనాపురం
(3) గుడారి
(4) గొట్టా
(5) హీరమండలం

పైన పేర్కొన్న వాటన్నిటిలో హీరమండలం ప్రాంతమే ఎంతో మెరుగైనదిగా భావించారు. ఎందుకంటే యిక్కడ రిజర్వాయరు

నిర్మించితే ఒరిస్సా రాష్ట్రంలో ఏ ప్రాంతమూ నీట మునిగిపోదు అంతేకాక ఆంధ్రప్రదేశ్‌లో సారవంతమైన సుక్షేత్రాలు కూడా మునిగిపోవు. ఒకవేళ గొట్టా గ్రామ ప్రాంతంలోగాని, మరే యితర ప్రాంతంలోగాని ఈ రిజర్వాయరును నిర్మించితే మన రాష్ట్రంలో సారవంతమైన పొలాలు కొన్ని మునిగిపోయే ప్రమాదం వుంది.

## ప్రస్తుత పథకం

కేంద్ర విద్యుచ్ఛక్తి, నీటిపారుదల శాఖామంత్రి డా. కె. ఎల్. రావు 28–12–68 న నీటిపారుదల చీఫ్ఇంజనీరుతో కలిసి వంశధార ప్రాజెక్టును పరిశీలించారు. యీ ప్రాజెక్టును రెండు దశల్లో అమలుపరచాలని యీ పరిశీలనలో నిశ్చయించారు. ఆ రెండుదశలు యివి—

మొదటిదశ:

(1) గొట్టగ్రామ ప్రాంతంలో వంశధార నదిమీద బ్యారేజీని నిర్మించడం.

(2) ప్రస్తుతం చెరువుల క్రింద సాగవుతున్న 98,494 ఎకరాలకు స్థిరమైన సేద్యపునీటి సౌకర్యాన్ని కల్పించడంతోపాటు నరసన్నపేట, టెక్కలి, పాతపట్నం, శ్రీకాకుళం తాలూకాల్లోను శ్రీకాకుళం జిల్లాలోగల పలాసా సబ్‌తాలూకాలోను మొత్తం 1,48,228 ఎకరాలకు సేద్యపు నీటిని అందజేయగల విధంగా నదికి ఎడమవైపున కాలువను త్రవ్వడం—యివి మొదటిదశ పనులు.

రెండవదశ:

(1) నేరడివద్ద వంశధారమీద బ్యారేజీని పూర్తిచేయడం.

(2) వంశధారలోని వరదనీటిని మళ్లించి, హీరమండలం రిజర్వాయరులోనిలువ చేయడానికి వీలుగా నేరడి బ్యారేజినుంచి కుడి వైపున కాలువను త్రవ్వాలని ఉద్దేశించారు. ఈ కాలువ క్రిందనే ఆంధ్రప్రదేశ్‌లో సుమారు 20,000 ఎకరాల ఆయకట్టు వుంటుంది. నదికి ఎడమవైపున సేద్యపునీటి సౌకర్యంలేకుండా పడివున్న తమ భూములకు నీటిని అందించాలని ఒకవేళ ఒరిస్సా ప్రభుత్వం భావించి నేరడి బారేజి నిర్మాణంలో తాముకూడా పాల్గొనదలిస్తే ఎడమవైపున మరొక కాలువను త్రవ్వడం జరుగుతుంది.

(3) నేరడి బ్యారేజి నుంచి కుడి కాలువ ద్వారా మళ్లించిన వరద నీటిని నిలువ చేయాడానికి హీరమండలం వద్ద వంశధార నది పరీవాహక ప్రాంతములోని చిన్న లోయలో రిజర్వాయరు నిర్మించడం.

(4) నదికి కుడి తట్టునగల 1,06,000 ఎకరాలకు సేద్యపు నీటిని అందించే విధంగా హీరమండలం కాలువను త్రవ్వడం.

(5) ఎడమవైపు ఆయకట్టుకు అవసరమయ్యే జలాలను అందించెందుకు గాను హీరమండలం రిజర్వాయరు నుంచి నది లోకి నీటిని క్రమ బద్ధంగా విడుదల చేయడానికి అనువుగా హీరమండలం రిజర్వాయరును, గొట్టా బారేజికి కలుపుతూ ఒక కాలువను నిర్మించడం. ఇవి రెండో దశ పనులు. ఈ దశపనులకు గాను 13 కోట్ల రూపాయలు ఖర్చవుతాయని అంచనా వేశారు.

## గొట్టా బ్యారేజి

ఇప్పుడు నిర్మించ దలచిన ఈ గొట్టా బ్యారేజి గొట్టా గ్రామానికి నైరుతి దిశగా సుమారు అరమైలు దూరంలో 18°-12′-0″ అక్షాంశం మీద, 83°-58′-0″ రేఖాంశం మీద వున్నది.

ఈ బ్యారేజి పొడవు 1615 అడుగులు, 200 సంవత్సరము లలో రాగల వరదల ప్రమాణమును 2,90,000 క్యూసెక్కులుగా నిర్ణయించి, దానికి తగు రీతిగా బ్యారేజీ నిర్మాణమును స్థిరపరచిరి. బ్యారేజి స్పిల్‌వే తలుపుల క్రింది మట్టము +110–00 గాను, ఒండ్రు తూములలో క్రింది మట్టము +104–00 గాను స్థిరీకరించ బడినవి. 2,90000 క్యూసెక్కుల వరద నీటిని పారుదల చేయుటకు ఇవి ఉద్దేశింప బడినవి. 20 శాతం నీటిని అధికముగా పారుదల చేయుటకు వీలు కల్పించ బడినది. 2,94,000 క్యూసెక్కుల నీటిని పారుదల చేయుగల 15×60′ పరిమాణము గల 22 స్పిల్‌వే తూములు, 32,400 క్యూసెక్కులు నీటి పారుదల గల 21′×40′ పరిమాణముగల మూడు ఒండ్రు తూములు ఏర్పాటు చేయబడినవి. వీటి వల్ల మొత్తము 3,26,400 క్యూసెక్కుల నీటి పారుదలకు అవకాశం కలదు. +124–00 నిండు కాలువ నీటి మట్టముతో 10 అడుగుల లోతు గల కాలువ ప్రారంభించ బడుతుంది.

ఎడమ వడ్డును, కుడి వడ్డులను కలుపుతూ +129–50 ఎత్తున 24 అడుగుల రోడ్డు మార్గం ఉంటుంది. "ఏ" క్లాసు బరువుకు వీలుగా 60′ అ. ల పొడవు గల L ఆకారపు దూలములమీద డెక్‌స్లేబు ఆధార పడుతుంది. నదికి రెండు వైపుల గల అనేక గ్రామాలను సైతం యీ రోడ్డు కలుపు తుంది.

జలాశయంలో నీటి మట్టమును +125.00 వద్ద స్థిరీకరించ డానికి స్పిల్‌వేకు స్కవర్‌వెంట్స్‌కు, నిలువున ఎత్తబడు గేటులు ఏర్పాటు చేయబడ్డాయి. గేటులను ఎత్తడానికి వీలుగా తగు ఏర్పాట్ల నిమిత్తం 12 అడుగుల వెడల్పు ప్లాటుఫారం ఒకటి +155.50 ఎత్తున వుంటుంది.

## ఏటిగట్లు (ఫ్లడ్ బేంక్స్)

బ్యారేజికి ఎగువ నదికి రెండు వైపుల 4 మైళ్ల4 ఫర్లాంగుల మేరకు ఏటి గట్లను ఏర్పాటు చేయాలని ఉద్దేశించారు. దీనివల్ల నదికి యిరువైపులా ఉన్న గ్రామాలకు, సారవంతమైన పంట పొలాలకు వరద ముంపు సమస్య వుండదు. బ్యారేజివద్ద ఏటి గట్టు పైమట్టం +31.00 వుంటుంది. రెండు వైపులా ఉన్న యీ గట్లు పై భాగాన ఒక మైలు దూరము

వరకు 10 అ. వెడల్పు కలిగి ఉంటాయి. ఇదే రోడ్డుగా కూడా ఉపయోగిస్తుంది. మిగతా మూడున్నర మైళ్ల దూరము యీ గట్లు పైభాగం 6 అడుగుల వెడల్పు వుంటుంది. పెద్ద ఎత్తున వరదలు వచ్చినప్పుడు నీరు పొర్లి పోకుండా బారేజి పరసన కుడి పార్శ్వంలో గట్టు (ప్రొటక్షన్ బండ్)ను నిర్మించడం జరుగుతుంది.

వంశధారనది ఎడమ తట్టున గల భూములకు సేద్యపు నీటిని అందించడానికై గొట్టా బ్యారేజి ఉద్దేశించ బడింది. అందు వల్ల ప్రధానమైన తూము ఎడమ పార్శ్వంలో వుంటుంది. 1,48,300 ఎకరాలకు సేద్యపు నీటిని అందించడానికి వీలుగా యీ ప్రధాన మైన తూము 2560 క్యూసెక్కుల నీటి వాహక శక్తిని కలిగి వుంటుంది. యీ మేరకు భూములకు అవసర మయ్యే నీటిని అందించ డానికి దీని నీటి వాహక శక్తి 2430 క్యూసెక్కులు వుంటే చాలు.

## గొట్టా ఎడమ కాలువ

ప్రస్తుతం సేద్యపు నీరు లభిస్తున్న భూములకు ఆ నీటిని అందించడంతో సహా మొత్తం 1,48,300 ఎకరాలకు సేద్యపు నీటిని అంద జేయడానికి వీలుగా యీ గొట్టా ఎడమ కాలువ రూపొందించ బడినది.

| | | |
|---|---|---|
| (1) | ప్రసుతం చెరువుల క్రింద సాగు. | 59,245 ఎకరాలు. |
| (2) | ఏటి కాలువల ద్వారా ప్రస్తుతం వున్న సాగు. | —39,249 ఎకరాలు. |
| (3) | క్రొత్తగా కల్పించ దలచినది. | 49,734 ఎకరాలు. |
| | మొత్తం | 1,48,228 ఎకరాలు. |

పుష్కలమైన పంట పండించడానికి ప్రస్తుతం చెరువుల క్రింద లభిస్తున్న సాగు నీరు పూర్తిగా సరిపోదు. స్థిరంగా నీటి సౌకర్యాన్ని యీ భూములకు కల్పించ వలసివుంది. ఈ చెరువుల క్రింద సాగవుతున్న భూముల్లో పంట దిగుబడి చాలా తక్కువ అని రెవెన్యూ రికార్డులను బట్టి వెల్లడవుతోంది. మామూలు నిర్ణీత దిగుబడిలో యీ దిగుబడి మూడవ వంతు కన్న తక్కువ గానే వుంటుంది. అందు వల్ల ఈ గొట్టా ఎడమ కాలువను రూపొందించే టప్పుడు యీ విషయాన్ని దృష్టిలో వుంచుకొని చెరువులకు స్థిరముగా నీటి సరఫరాకు వీలుగా వాటికి కావలసిన 75 శాతం జలాన్ని సైతం అందజేసేటట్లు రూపొందించడం జరుగుతుంది.

గొట్టా బ్యారేజి నిర్మాణపు పనులకు రూ. 289.20 లక్షలుఖర్చువుతుందనిర, గ్రాప్రత్యక్ష పరోక్ష చార్జీలతో సహా రూ. 325.70 లు ఖర్చు కాగలదని అంచనా వేశారు.

గొట్టా కాలువ నిర్మాణానికి రూ. 479.033 లక్షలు ఖర్చవు తుందనీ, ప్రత్యక్ష పరోక్ష చార్జీలతో సహా రూ. 538.30 లక్షలు ఖర్చు కాగలదని అంచనా.

## నిర్మాణ కార్యక్రమం

గొట్టా బ్యారేజి నిర్మాణం, దాని ఎడమ కాలువ త్రవ్వకం (ఈ పథకం తొలిదశ) 5 సంవత్సరాలలో పూర్తి చేయాలని ఉద్దేశించారు. ఈ దిగువ దీని మీద ఖర్చు వివరాలు యివ్వడ మైనది.

## ప్రయోజనాలు

శ్రీకాకుళం జిల్లా తరచుగా అనావృష్టికి గురిఅయ్యే ప్రాంతం ఈ పథకం వల్ల ఈ జిల్లాలో చెరువుల క్రింద సాగయ్యే 59,245 ఎకరాలకు, ఏటి కాలువల ద్వారా సాగయ్యే 39,249 ఎకరాలకు వెరసి 98,494 ఎకరాల స్థిరమైన నీటి సౌకర్యము లేని ఆయకట్టుకు స్థిరంగా సాగు నీటిని అంద జేయడానికి వీలవుతుంది.

దీనికి తోడు కొత్తగా 49,734 ఎకరాల ఆయకట్టు కూడా దీని క్రింద ఏర్పడు తుంది.

ఈ పథకం ప్రయోజనాలు, దీనికైన ఖర్చులు 6.6:1 నిష్పత్తిలో వుంటవి. ఈ ప్రాజెక్టు పూర్తయిన పదవ సంవత్స

| సంవత్సర ప్రారంభం | సంవత్సరపు వారీ ఖర్చు లక్షల రూపాయలలో. | | మొత్తం. | సంవత్సరపు ఆఖరుకు ప్రాజెక్టుపై ఖర్చు పెట్టిన మొత్తం. |
|---|---|---|---|---|
| | గొట్టాబారేజిపై. | గొట్టా కాలువపై. | | |
| తొలి సంవత్సరం | 50—00 | 50—00 | 100—00 | 100—00 |
| రెండవ సంవత్సరం | 125—00 | 80—00 | 205—00 | 305—00 |
| మూడవ సంవత్సరం | 100—70 | 100—00 | 200—70 | 505—70 |
| నాల్గవ సంవత్సరం | 50—00 | 150—00 | 200—00 | 705—70 |
| ఐదవ సంవత్సరం | ... | 158—30 | 158—30 | 864—00 |

రాంతానికి దీని వల్ల వచ్చే ఆర్థిక ప్రయోజనం 0.98 వుంటుందని అంచనా వేశారు.

ముగింపు :

శ్రీకాకుళం జిల్లాలో కరువు కాటకాల్ని పారద్రోలడానికి వంశధార ప్రాజెక్టు పథకాన్ని ఒక దానిని ఈస్టిండియా కంపెనీ అధ్వర్యం క్రింద చేపట్టాలని నూరేళ్ళ క్రిందటే కెప్టెన్ రన్‌డాల్ యోచించారు.

అనేక సహజ సిద్ధమైన వసరులతో అలరారుతూ, చక్కటి వర్ష పాతం కలిగి, నిండైన నదులు వుండి, సారవంతమైన భూములకు ఆలవాలమై, కష్టించి పని చేయగల ప్రజలకు నిలయమై కూడా యీ జిల్లా తరచు అనావృష్టికి గురి అవుతూండడం శోచనీయం. చక్కటి వర్షపాతం కలిగి, నదులలో సమృద్ధిగా నీరు వున్నప్పటికీ యివి సకాలంలోనూ సక్రమ పద్ధతి లోనూ లభించక తరచుగా యీ విపత్కర పరిస్థితి ఏర్పడుతోంది. అందు వల్ల యిటు వంటి వర్షపాతాన్ని నదులనూ ప్రసన్నము చేసుకొని ప్రయోజనం పొందాలంటే వర్షం వచ్చినప్పటి వరదనీటిని నిలువచేసే రిజర్వాయరును నిర్మించి అవసరం మేరకు సాగుకు నీటిని విడుదల చేయ వలసి వుంటుంది. ఈ వంశధార ప్రాజెక్టు పథకం అదే ఉద్దేశముతో చేపట్టబడింది. తొలి దశ పూర్తయీ కాగానే రిజర్వాయరు లేకుండానే తొలి దశ వల్ల ప్రయోజనము పొందే విధంగా యీ పథకం రూపొందించ బడింది.

అంతర రాష్ట్రీయ నదీ జలాల ఒప్పందం క్రింద తన వంతు భాగాన్ని ఒరిస్సా ప్రభుత్వం పూర్తిగా వాడుకోవడం ప్రారంభించినప్పుడు నీటి ఎద్దడి కాలాల్లో నదిలో అంతగా నీరు ఉండదు. గనుక ఆలాంటప్పుడు వరదలో వృధా అయ్యే నీటిని నిలువ చేయడానికి రెండవ దశవల్ల వీలు కలుగుతుంది.

ఈ ప్రాంతాలు అంతకు ముందే సాగు క్రింద వున్న కారణం చేత ఈ పథకం తాలూకు ప్రతి దశలోనూ ఆయ కట్టు అభివృద్ధి చాలా శీఘ్రవంతంగా జరుగు తుంది. దీని ప్రయోజనాలు సత్వరమే అభిస్తాయి. ప్రజలు కూడా సాగు నీటికి సంబంధించిన సమస్యలు అంటే భూమిని బాగు చేసుకోవడం, పంట కాలువల్ని త్రవ్వుకోవడం మొదలైన పనులనుగూర్చి అంతకు ముందే బాగా అవగాహన చేసుకున్న వారు కావడంవల్ల ఏతత్ప్రయోజనాలు వెనువెంటనే లభించ డానికి వీలుంటుంది.




ఏప్రెల్ 16వ తేదీన ముఖ్య మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గొట్టా బ్యారేజి పైలాన్ ఆవిష్కరించిన దృశ్యం. ఈ కార్యక్రమానికి నీటివనరుల మంత్రి శ్రీ శీలం సిద్ధారెడ్డి అధ్యక్షత వహించారు.

# విశాఖపట్టణములో ఉక్కు కర్మాగారం



ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి, లోక్‌సభలో చేసిన ప్రకటన :

ప్రస్తుత ప్రణాళికా కాలంలో కొత్త ఉక్కు కర్మాగారాల అభివృద్ధికి గాను రూ. 110 కోట్లు కేటాయించడమయింది. మామూలు రకం ఉక్కు తయారుచేసే సంఘటిత కర్మాగారాలు రెంటినీ, ఒక ప్రత్యేకరకపు ఉక్కు కర్మాగారాన్నీ నెలకొల్పే విషయమై పని ప్రారంభించాలని ప్రభుత్వం నిశ్చయించింది. వీటి స్థాపన నిమిత్తం వేర్వేరు స్థలాలను పరిశీలించడమయింది.

ఉక్కు సామగ్రిని ఎగుమతి చేసేందుకూ, అవసరమైన ముడి పదార్థాలను దిగుమతి చేసుకునేందుకూ ఓడరేవు అవసరం. కనుక, రేవుపట్టణంలో ఉక్కు కర్మాగారాన్ని నెలకొల్పడం ప్రయోజనకరం కాగలదు. ఈ దృష్ట్యా, నాల్గవ ప్రణాళికాకాలంలో చేపట్టబడనున్న ఉక్కు కర్మాగారాల్లో ఒకటి విశాఖపట్టణంలో నెలకొల్పాలని భారత ప్రభుత్వం నిశ్చయించింది.

మేలిరకం ఇనుపఖనిజం మైసూరు రాష్ట్రంలోని హోస్పేట పరిసరాలలో విస్తారంగా లభ్యమవుతుంది. ఉక్కుకర్మాగారం ఏదీ ఆ ప్రాంతంలో లేనందున ఆ ఖనిజం కొంతవరకు మాత్రమే ఎగుమతి అవుతూన్నది. ఇక్కడి ఖనిజాన్ని చాలినంత మేరకు వినియోగించుకునే నిమిత్తం, హోస్పేట ప్రాంతంలో ఒక ఉక్కు కర్మాగారాన్ని నెలకొల్పాలని నిశ్చయించడమయింది.

## కొత్తగా మూడు ఉక్కుకర్మాగారాలు

విశాఖపట్టణం, హోస్పేటలలో నెలకొల్పబోతున్న కర్మాగారాలలో మామూలురకం ఉక్కు ప్రధానంగా తయారవుతుంది. అయితే, వేర్వేరు ప్రత్యేక రకాల ఉక్కుకు దేశంలో గణనీయమైన గిరాకీ ఉంది. ముఖ్యంగా తమిళనాడు, మైసూరురాష్ట్రాలలోని అనేక కర్మాగారాలకు ఈ రకాల ఉక్కు అవసరం. ఈ గిరాకీని తీర్చడానికీ, ఈ ప్రాంతం పారిశ్రామికంగా అభివృద్ధి చెందేట్లు చూడడానికీ, తమిళనాడులోని సేలం జిల్లాలో ఒక ఉక్కు కర్మాగారాన్ని నెలకొల్పాలని ప్రభుత్వం నిశ్చయించింది స్థానికంగా లభ్యమయ్యే ఇనుప ఖనిజాన్నీ, నైవేలీలో లభించే లిగ్నైటునూ ఆధారంగా చేసుకొని ఈ కర్మాగారం ఏర్పాటవుతుంది.

ఈ మూడు ఉక్కుకర్మాగారాల స్థాపన విషయంలోనూ, తొలి కార్యక్రమాన్ని, 4వ ప్రణాళికాకాలంలోనే, వీలైనంత త్వరితగతిన ప్రారంభించాలని ప్రభుత్వం సంకల్పించింది. ఈ కర్మాగారాలకు భారతీయ ఇంజనీర్లే రూపకల్పన చేయవలసి ఉంటుంది. దేశంలో తయారయ్యే పరికరాలనే ఈ కర్మాగారాలకు వినియోగించవలసి ఉంటుంది, కనుక సాంకేతిక సిబ్బంది అందుబాటులో ఉండటాన్నీ, ఇంజనీరింగ్ సామగ్రిని తయారుచేసే కర్మాగారాలలో ఉత్పత్తిస్థోమతునూబట్టి, ఈ ఉక్కు కర్మాగారాల స్థాపన కార్యక్రమాన్ని తీర్చిదిద్దవలసి వస్తుంది అని ప్రధానమంత్రి తమ ప్రకటనలో తెలియచేశారు.

—×—

# హైదరాబాదు జిల్లాలో

## కొత్తపరిశ్రమలకు అవకాశాలు

1. పిల్ఫర్‌ప్రూఫ్ మూతలు :

(i) ఇవి కల్తీని నిరోధించడానికి తోడ్పడతాయి ఎక్కువగా వీటిని సీసాలలో పదార్థాలను నిల్వచేసే పరిశ్రమలలో వుపయోగిస్తుంటారు.

(ii) ప్రస్తుతం ఇటువంటి మూతలను మద్రాసునించీ, బొంబాయినించీ దిగుమతి చేసుకొంటున్నాము.

(iii) ఏటా రు. 3 లక్షల విలువచేసే మూతలు మనకు అవసరం 1970 లో రెండు భారీతరహా యూనిట్లకు రూ. 4 4 లక్షల మేరకు గిరాకీ వున్నట్లు వెల్లడైంది. వీటిని తయారుచేయడానికి కనీసము 2 యూనిట్లనన్నా ఇక్కడ నెలకొల్పే అవకాశముంది.

2 ప్రెషర్ డై కేస్టింగులు :

(i) రిఫ్రిజిరేషన్ పరికరాలను తయారు చేసే కర్మాగారానికి అల్యూమినియం ప్రెషర్ డై కేస్టింగులు చాలా అవసరం.

(ii) కార్లు మొదలైనవాటి కొన్ని విడిభాగాల రూపంలోనూ కుట్టు మిషన్లు, రిఫ్రిజరేటర్లలో వినియోగించే కొన్ని భాగాల రూపంలోనూ ప్రెషర్ డై కేస్టింగులకు మన రాష్ట్రంలో మంచి గిరాకీ వుంది.

(iii) 1965 లో 1¼ లక్షల రూపాయల విలువైన యీ ప్రెషర్ డై కేస్టింగులు రాష్ట్రంలో వినియోగింపబడ్డాయి.

(iv) ఈ రకం వాటిని తయారుచేసే లఘుపరిశ్రమల యూనిటు ఒక్కటిగూడ ఆంధ్రప్రదేశ్‌లో లేకపోవడం వల్ల అటువంటి పరిశ్రమను ఒకదానిని యిక్కడ నెలకొల్పుకోవచ్చు.

2. కూలంట్ పంపులు :

(i) యంత్రపరికరాలలో ఒక భాగంగా వీటిని వుపయోగిస్తారు.

(ii) ఒక భారీతరహా పరిశ్రమకు యిటువంటి మోనోబ్లాక్ కూలంట్ పంపులు 1800 ల వరకు ఏటా కావలసి వున్నాయి. యంత్రపరికరాల్ని తయారు యితర పరిశ్రమలవారికి కూడా వీటి అవసరం వుంది.

(iii) మన రాష్ట్రంలో యివి తయారుకావడం లేదు.

(iv) జిల్లాలో యిటువంటి యూనిటును ఒకదానిని నెలకొల్పుకోవచ్చు.

4. పేటరన్ షాప్ :

(i) కర్రవి, లోహాలవి, ప్లాస్టిక్‌వి రెక్సిన్‌వి పేట్రన్‌లలో ప్రత్యేకంగా నైపుణ్యాన్ని చూపించగల పేట్రన్‌షాపు ఒకటి వుంటే హైదరాబాదు జిల్లాలో ఫోర్జింగ్ షాపులు, ఫౌండ్రీల అవసరాలను తీర్చగలుగుతుంది.

(ii) 1966 లో యీ విధమైనవి ఒకలక్ష రూపాయల విలువగల వాటికి గిరాకీ వున్నట్లు అంచనా వేశారు.

(iii) ప్రస్తుతం యివి మనకు బొంబాయి నుంచి వస్తున్నాయి.

(iv) హైదరాబాదుజిల్లాలో యిటువంటి యూనిటును ఒకదానిని నెలకొల్పేందుకు మంచి అవకాశం వుంది.

5' స్టార్టర్ రిలేలు :

(i) స్టార్టర్ రిలేలను వివిధరకాల ఎలక్ట్రికల్ పరికరాలలోనూ, ఎలక్ట్రానిక్ పరికరాలలోనూ ఉపయోగిస్తుంటారు.

(ii) రిఫ్రిజరేషన్ పరికరాలను తయారుచేసే ఒక భారీ యూనిటుకు సంవత్సరానికి రూ. 2.16 లక్షల విలువచేసే స్టార్టర్ రిలేలు కావాలి.

(iii) ప్రస్తుతం వీటిని బొంబాయినుంచి తెప్పించు కొంటున్నాము.

(iv) వీటిని తయారుచేసే యూనిటు ఒకదాన్ని యిక్కడ ఏర్పాటు చేసుకోవచ్చు.

6. గాజు సీసాలు (ఆటోమేటిక్ యంత్రంతో)

(i) మందుల తయారీకి, సౌందర్య పోషక సామగ్రి తయారీకి, ఆహార పదార్థాల్ని నిల్వచేయడానికి సంబం

ధించిన పరిశ్రమల్లోనూ, మరికొన్ని యితర పరిశ్రమల్లోనూ గాజు సీసాల్ని వాడుతుంటారు.

(ii) ఒక్క మందుల కంపెనీలకే 7 లక్షల రూపాయల విలువగల గాజు సీసాలు సాలీనా కావలసి వుంటాయి.

(iii) ముందుముందు యింకా ఎక్కువమేరకు యివి అవసరం కావొచ్చు, ఒకానొక కంపెనీకి ఒక్కదానికే 1970 నాటికి 79 లక్షల రూపాయల విలువచేసే గాజు సీసాలు కావలసి వుంటాయని అంచనా వేయడం జరిగింది.

(iv) గాజు సీసాల్ని తయారు చేయడానికి ముఖ్యంగా కావలసిన సిలిక ఇసుక, సున్నపురాయి యీ జిల్లాలో పుష్కలంగా వున్నాయి.

(v) గాజు సీసాల్ని తయారుచేసే పరిశ్రమకు యిక్కడ మంచి అవకాశాలు వున్నాయి.

7. లైమ్ సుర్కీ సిమ్మెంటు :

(i) ఒక ప్రత్యేక తరహాకు చెందిన లైమ్ సుర్కీ సిమ్మెంటును కట్టడపు పనుల్లో వుపయోగించవచ్చు.

(ii) ఇది సాధారణంగా ప్లాస్టర్ చేయడానికి తోడ్పడుతుంది అందువల్ల పోర్టులాండ్ సిమ్మెంటు స్థానే దీన్ని వుపయోగించుకోవచ్చు.

(iii) ఇది చాలా చవక. అందువల్ల పోర్ట్‌లాండ్ సిమ్మెంటు పోటీకి నిలువగలుగుతుంది.

(iv) దీనిలోని ప్రధాన ముడిపదార్థాలైన సున్నపురాయి, బంకమన్ను యీ జిల్లాలో ఎక్కువగానే లభిస్తున్నాయి.

(v) ప్రభుత్వ సహకారంతో కనీసం యిటువంటి యూనిటును ఒకదాన్నయినా యిక్కడ నెలకొల్పుకోవచ్చు.

8. ఇళ్ళపెంకులు (మంగుళూరు రకం)

(i) ఇళ్ళపై కప్పులకు వీటిని వాడుతుంటారు గనుక వీటికి బాగానే గిరాకీ వుంటుంది.

(ii) ఏటా 25 లక్షల పెంకులవరకు గిరాకీ వుంటుంది.

(iii) ప్రస్తుతం మనకు కావలసి యీ పెంకులు కేరళనుంచి వస్తున్నాయి.

(iv) ఈ పెంకుల్ని తయారు చేయడానికి కావలసిన బంకమన్ను హైదరాబాదు జిల్లాలో లభిస్తున్నది.

(v) యిక్కడ మార్కెటు చేయడానికి, మంచి బంకమన్ను దొరకడానికీ అవకాశాలు వున్న దృష్ట్యా ఇక్కడ ఒక యూనిటును నెలకొల్పుకోవడం లాభసాటిగానే వుంటుంది.

9. పోతపోసిన రబ్బరు వస్తువులు :

(i) పరిశ్రమలతో వీటి వుపయోగం మాట అటుంచి ప్రజలకుకూడా యివి వేడినీటి సంచులు, ఐస్‌బేగ్‌లు మొదలైన వాటిరూపంలో బాగా అవసరమౌతాయి.

(ii) రెండు పెద్దతరహా పరిశ్రమలకు యివి 0.45 లక్షల రూపాయల విలువమేరకు కావలసి వుంది. పైగా మామూలుగా ప్రజల అవసరాలకు కూడా వీటికి మంచి గిరాకీ వుంది.

(iii) మన రాష్ట్రంలో వీటిని తయారుచేసే యూనిటు ఒకటీ లేకపోవడంవల్ల బొంబాయి, కలకత్తా మొదలగు చోట్ల నుంచి దిగుమతి చేసుకోవలసి వస్తోంది.

(iv) కనీసం యిటువంటి యూనిటును ఒక్కదానినైనా వెను వెంటనే యిక్కడ ఏర్పాటు చేసుకోవచ్చు.

10. పొటాషియం పర్మాంగనేటు :

(i) శుద్ధిచేసే పనులలోనూ, వైద్యంలో వ్యాధి సోకకుండా కాపాడేందుకూ దీనిని ఉపయోగిస్తుంటారు

(ii) మార్కెటులో దీనికి యేటా రూ 1.75 లక్షల విలువ మేరకు గిరాకీ వుంటున్నట్టు అంచనా వేశారు.

(iii) ఈ జిల్లాలో నెలకొల్పిన ఒక భారీ యూనిటు ఒకదానికి 1967_68 నాటికి 137 టన్నులు పొటాషియం పర్మాంగనేటు అవసరమౌతుందని అంచనా వేశారు.

(iv) ఇప్పుడు బొంబాయి నుంచి మనకు పొటాషియం పర్మాంగనేటు సరఫరా అవుతోంది.

(v) ప్రస్తుతంవున్న గిరాకీ దృష్ట్యా దీనిని తయారుచేసే యూనిట్లను రెంటిని యిక్కడ ఏర్పాటు చేసుకోవచ్చు.

11. క్లోరోఫామ్ :

(i) మందులు తయారుచేసే పరిశ్రమల్లో దీనిని వాడుతారు. ఆసుపత్రులలో కూడా మత్తు కల్పించడానికి దీనిని వినియోగిస్తారు.

(ii) ఒక పెద్ద మందుల తయారీ కంపెనీకి 1967_68 నాటికి 58.12 టన్నుల క్లోరోఫారం కావలసివుంది. ఇటువంటిదే మరో పెద్ద కంపెనీకి యిప్పుడు పదివేల రూపాయల ఖరీదుచేసే క్లోరోఫారం అవసరంవుంది. మార్కెటులో ఏటా క్లోరోఫారం అమ్మకం 10 వేల రూపాయల మేరకున్నాయని అంచనా.

12. సోడియం అసిటేట్ :

(i) దీనిని మందుల తయారీలో ఉపయోగిస్తారు.

(ii) భారీయెత్తున మందులు తయారుచేసే ఒక కంపెనీకి 1967_68 నాటికి సోడియం అసిటేట్ 6.30 టన్నులు,

సోడియం హైడ్రేట్ అండ్ ఫ్యూజు 7.50 టన్నులు కావలసి వుంటుంది.

(iii) సోడియం హైడ్రేట్‌ను తయారుచేసే యూనిటు ఒక్కటి కూడా మన రాష్ట్రంలో లేదు.

(iv) హైదరాబాదు జిల్లాలో యీ మాదిరి యూనిటును ఒక దాన్ని నెలకొల్పడానికి చక్కటి అవకాశం వుంది.

13. బంగాళాదుంప పిండి :

(i) దీనిని వివిధ పరిశ్రమల్లో ఉపయోగిస్తుంటారు.

(ii) 1967_68 నాటికి ఒక భారీ మందుల కంపెనీకి 90 టన్నుల బంగాళాదుంప పిండి ఏటా అవసరమౌతుందేది.

(iii) బంగాళాదుంపలనుంచి పిండినితీసే యూనిటు మన రాష్ట్రములో ఒక్కటీలేదు

(iv) 1963_64లో ఈ జిల్లాలో 1,540 టన్నుల బంగాళాదుంపలు పండాయి.

(v) వీటినుంచి పిండినితీసే యూనిటును ఒకదాన్ని ఇక్కడ నెలకొల్పుకోవచ్చు

14. డెక్స్ట్రిన్ :

(i) దీనిని మొక్కజొన్న గింజలనుండి తయారు చేస్తారు. జిగురు తయారు చేయడానికి యిది వుపయోగిస్తుంది. పేకింగ్‌కు యిది బాగా తోడ్పడుతుంది.

(ii) దీనికి మార్కెటులో గిరాకీ వుండడమేగాక హైదరాబాదులోని ఒక భారీ యూనిటు ఒకదానికి దగ్గర దగ్గర 1.3 లక్షలరూపాయల విలువచేసే డెక్స్ట్రిన్, మొక్కజొన్న పిండి కావలసివుంది.

(iii) ప్రస్తుతం రాష్ట్రంలో యీ పిండిని తయారుచేసే యూనిటులేదు. అందువల్ల మనకు కావలసినమేరకు దీనిని అహ్మదాబాదు నుంచి తెప్పించుకోవడం జరుగుతోంది.

(iv) 1963_64లో హైదరాబాదు జిల్లాలో సుమారు 4,670 టన్నుల మొక్కజొన్న పండింది.

(v) మొక్కజొన్న పిండిని, డెక్స్ట్రిన్‌ను తయారుజేసే యూనిటును ఒకదానిని యిక్కడ నెలకొల్పుకోడానికి అవకాశాలు బావున్నాయి.

15. పెక్టిన్ :

(i) పళ్ళను నిలవ చేసే పరిశ్రమల్లోనూ, మందుల్ని తయారుచేసే పరిశ్రమలోనూ వీటిని ఉపయోగిస్తారు. ఒక భారీ తరహా యూనిటుకు ఏటా 6,250 రూ॥లు విలువచేసే పెక్టిన్‌లు కావలసి వుండేవి 1970 నాటికి రూ. 1.25 లక్షల మేరకు వీటి గిరాకీ పెరగవచ్చు.

(ii) పాపెన్‌లకు కూడా మందుల్ని తయారుచేసే పరిశ్రమల్లో మంచి గిరాకీ వుంది.

(iii) ఈ రకమైన యూనిటు మన రాష్ట్రంలో ఒక్కటికూడా లేదు.

(iv) 1963_64లో హైదరాబాదు జిల్లాలో సుమారు 14 ఎకరాలలో బొప్పాయిపంట వుంది.

(v) ఈ జిల్లాలో బొప్పాయల పంటను ఎక్కువచేస్తే యీ పరిశ్రమకు మంచి అవకాశాలు ఉంటాయి.

16. బేక్‌లైట్ పోతవస్తువులు :

(i) వివిధ పరిశ్రమలలో యీ పోతవస్తువులు సహాయక భాగాలుగా ఉపకరిస్తాయి.

(ii) వీటికి మార్కెటులో మంచి గిరాకీ వుండడమేగాక కుట్టు మిషన్లను తయారుచేసే ఒక భారీ యూనిటుకు ఏటా 1.20 లక్షల రూపాయల విలువచేసే బేక్‌లైట్ పోత వస్తువులు కావలసివున్నవి.

(iii) ప్రస్తుతం యీ వస్తువులు బొంబాయి, కలకత్తాల నుండి వస్తున్నాయి.

(iv) దీనికి కావలసిన ప్రధానమైన ముడి పదార్థం బేక్‌లైట్ ఈ జిల్లాలోనే లభిస్తున్నది.

(v) ఇటువంటి వస్తువుల్ని తయారుచేసే యూనిటును ఒక దానిని నెలకొల్పుకోవడానికి ఇక్కడ అవకాశంవుంది.

17 థర్మో ప్లాస్టిక్ వస్తువులు :

(i) పరిశ్రమలో అనేక రకాలుగా యివి అవసరమౌతాయి.

(ii) మార్కెటులో ప్రజల వినియోగానికి వీటికి మంచి గిరాకీ వుంది. అదిగాక ఒక భారీ యూనిటుకు ఏటా 36 వేల రూపాయల మేరకు యీ వస్తువులు కావలసివున్నాయి.

(iii) ప్రస్తుతం ఈ వస్తువుల సరఫరా కలకత్తానుంచి జరుగుతున్నది.

(iv) ఈ పరిశ్రమాభివృద్ధికి హైదరాబాదు జిల్లాలో చక్కటి అవకాశంవుంది.

18 శుద్ధిచేసిన ఆముదపు నూనె :

(i) వైద్యంలో ఇది చాలా రకాలుగా వుపయోగిస్తుంది. అదిగాక కూడా దీన్ని వాడతారు.

(ii) ఇక్కడి స్థానిక యూనిటు ఒకటి ఆముదపు గింజలనుండి శుద్ధి చేసిన ఆముదపు నూనెను తయారుచేస్తున్నప్పటికీ వైద్యంలో వాడకానికి తగిన నూనెను తయారుచేసే యూనిటు మాత్రం ఏదీ లేదు.

(iii) హైదరాబాదు జిల్లాలో ఆముదపు గింజలు బాగానే పండుతున్నాయి.

(iv) దీనికి దేశవ్యాప్తంగా గిరాకీవున్నందువల్లా, ఈ పంట హైదరాబాదు జిల్లాలో ఎక్కువగానే వున్నందువల్లా కనీసం ఒక యూనిటునైనా యిక్కడ నెలకొల్పేందుకు అవకాశంవుంది.

19. వాటర్‌ప్రూఫ్ ప్యాకింగ్‌పేపరు :

(i) ప్యాకింగ్ పనులకు ఈ కాగితం బాగా వుపయోగిస్తుంది.

(ii) ప్రస్తుతం యీ మాదిరి కాగితానికి 14.5 లక్షల రూపాయల మేరకు గిరాకీవుంది.

(iii) ఈ జిల్లాలో యీ పేపరును తయారుచేసే యూనిటు ఒకటి యిప్పుడువుంది. అయితే యిప్పుడున్న అవసరం మేరకు ఉత్పత్తి చేయలేకపోతుంది.

(iv) ఇటువంటివి మరో రెండు యూనిట్లను నెలకొల్పుకో వచ్చు.

20. ప్యాకింగ్ పెట్టెలు :

(i) అనేక పరిశ్రమల్లో ప్యాకింగ్ పనులను యివి ఉప యోగిస్తాయి.

(ii) ఏటా 24 లక్షల రూపాయల మేరకు వీటికి గిరాకీవుంది.

(iii) హైదరాబాదుజిల్లాలో వీటిని తయారుచేసే యూనిట్లు రెండువున్నాయి. అయితే యివి పెద్ద ఎత్తున కొనుగోలు చేసేవారికి సరఫరాచేయడంలేదు. గిరాకీకి తగ్గట్టు సరఫరా చేయలేక పోతున్నాయి.

(iv) మరోరెండు యూనిట్లనన్నా యిక్కడ నెలకొల్పుకో వచ్చు.

21. గమ్ టేప్ (కాగితానిది)

(i) తడిచేసి అంటించడానికి వీలైన యీ టేప్‌ను ప్యాకింగ్ పనుల్లో వుపయోగిస్తారు.

(ii) ఏటా 79,000 రూ.ల విలువ మేరకు దీనికి గిరాకీవుంది.

(iii) దీన్ని తయరుచేసే యూనిటు మనరాష్ట్రంలో ఒక్కటి కూడా లేదు.

(iv) దీనిని తయారుచేసే యూనిటు ఒకదాన్ని యిక్కడ నెలకొల్పుకోవచ్చు.

22. వార్నిష్‌వేసిన కాంబ్రిక్‌క్లాత్ :

(i) ఇన్సులేషన్ పనికి ఒక భారీయూనిటుకు యీ గుడ్డ అవసరమవుతున్నది.

(ii) ఏటా దీనికి లక్షరూపాయల మేరకు గిరాకీవుంది.

(iii) ఇతర రాష్ట్రాలలో వున్న ఎలక్ట్రిక్ కంపెనీలకూడా ఇన్సులేషన్ పనులకు యీ గుడ్డ కావలసివస్తున్నది.

(iv) దీన్ని తయారుచేసే యూనిటు ఒకదాన్ని యిక్కడ నెలకొల్పుకోడానికి చక్కటి అవకాశంవుంది.

23. కుట్టుదారం :

(i) జోళ్ళు కుట్టడానికి అవసరమయ్యే ఒక ప్రత్యేక తరహా కుట్టుదారం ఒక భారీ యూనిటుకు కావలసివుంది.

(ii) ఈ దారానికి ఏటా రూ 1 6 లక్షల మేరకు గిరాకీ వుండొచ్చు.

(iii) యిప్పుడు హైదరాబాదు జిల్లాలో ఈ దారం తయారు కావడంలేదు.

(iv) దారాన్ని తయారుచేసే యూనిట్లు కనీసం రెండింటినైనా యిక్కడ నెలకొల్పుకోడానికి అవకాశంవుంది.

24. బూటుదారాలు :

(i) బూట్లను తయారుచేసేవారికి యివి అవసరమౌతాయి. అదీగాక తెగిపోయిన బూటుదారాల స్థానే కొత్తవాటిని కొనుక్కోవలసిన అవసరంకూడా వినియోగదార్లకు వుంది.

(ii) 1967 లో ఒకభారీ యూనిటుకు 5 లక్షల రూపాయల విలువమేరకు ఏటా బూటుదారాల గిరాకీ వుంది.

(iii) ఇతర చిన్నతరహా కంపెనీలకు, వినియోగదార్లకు కూడా యివి, బాగా అవసరం వున్నందువల్ల ఆ విధంగా కూడా వీటికి గిరాకీ వుంది.

(iv) లక్షరూపాయల విలువగల బూటు దారాలను ఉత్పత్తి చేయగల ఐదు యూనిట్లను యిక్కడ నెలకొల్పుకోవ డానికి అవకాశం వుంది.

25. ఉడెన్ కేబుల్ డ్రమ్ములు :

(i) వైర్లను చుట్టడానికి, ప్యాకింగుకు ఒక భారీ కర్మాగారానికి యివి కావలసివున్నాయి.

(ii) ప్రస్తుతం ఏటా వీటికి 0.90 లక్షల రూపాయల మేరకు గిరాకీవుంది.

(iii) ఈ ప్రాంతంలో కర్ర బాగానే లభ్యమవుతుంది.

(iv) అందువల్ల కర్రతో చేసే కేబుల్ డ్రమ్ములను తయారు చేయగల యూనిటు ఒకదాన్ని యిక్కడ ఏర్పాటు చేసుకోవచ్చు.



# మన చరిత్ర సంస్కృతి



శ్రీశైలం శిల్ప సౌందర్యం

## ఆదికావ్యం అవతరణ

విష్ణుకుండినుల తరువాత పూర్వాంధ్ర దేశాన్ని పరిపాలించిన వారు చాళుక్య వంశ క్షత్రియులు. వీరు మహారాష్ట్ర ప్రాంతంలోని వాతాపి — ఇప్పటి బాదామి — రాజధానిగా పరిపాలన సాగించిన పులకేశి మహారాజుకు సంబంధించిన వారు. హర్షవర్ధన చక్రవర్తిని ఓడించిన మహా పరాక్రమ వంతుడు పులకేశి. ఆయన తమ్ముడు విష్ణువర్ధనుడే వేంగీ ప్రాంతపు తూర్పు చాళుక్య వంశానికి స్థాపకుడు. క్రీస్తుశకం 625 వ సంవత్సరంలో వేంగీదేశంలో విష్ణువర్ధనుని స్వతంత్ర పరిపాలన ప్రారంభమైంది. దక్షిణాన రాజ్యం చేస్తున్న చోళ మహారాజులు తమ ఆడు బిడ్డలను వేంగీ చాళుక్య మహారాజులకిచ్చి పెళ్ళిళ్ళు చేసి వియ్యాలు జరిపారు. రాజరాజ చోళమహారాజు తన సోదరి కుందవాంబను శక్తి వర్మ సోదరుడు విమలాదిత్యునికిచ్చి పెళ్ళి చేశాడు. ఈ దంపతులకు పుట్టినవాడే మన రాజరాజ నరేంద్రుడు. రాజరాజ నరేంద్రుడు రాజేంద్రచోళుని కూతురు అమ్మంగదేవిని వివాహమాడాడు. రాజరాజ నరేంద్రుని పాలన క్రీ. శ. 1022 లో ప్రారంభమైనది. మన ఆదికవి నన్నయ రాజరాజ నరేంద్రుని ఆస్థానాన్ని అలంకరించాడు. వేంగీచాళుక్యుల కాలంలోనే తెలుగు భాష క్రమక్రమంగా అభివృద్ధి పొందసాగింది; పద్యరచనకు పాదులు పడసాగినవి. రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహంతో నన్నయ ప్రారంభించిన ఆంధ్ర మహాభారతమే మనకు దొరికిన మొట్టమొదటి తెలుగు గ్రంథం. వేంగీ చాళుక్యుల కాలంలో వర్తక వ్యాపారాలుగూడ విస్తరించినవి. తూర్పు దేశాలతోనూ, ద్వీపాలతోనూ మనవర్తకులు ఓడ వ్యాపారం పెద్ద యెత్తున జరిపేవారు.

వెనుకటి మన ఆంధ్రుల ఓడవ్యాపారాన్ని గురించి, సముద్ర యానాన్ని గురించి మాట్లాడినప్పుడు మనం కళింగాన్ని మరచిపోలేం. మధ్యాంధ్ర దేశంలో గోదావరీ మండలంలోని పిఠాపురం మొదలుకొని ఉత్తరాన మహానది దాకా వ్యాపించిన ప్రాంతాన్ని కళింగం అంటారు. ఆ కాలంలో కళింగ ప్రజలు కళింగ ప్రభువులు అందరూ బౌద్ధులు. గంగ వంశపు రాజులు కళింగాన్ని క్రీ. శ. 600 మొదలుకొని 1400 సంవత్సరం దాకా పరిపాలించారు. గంగవంశపు రాజులు వేదవిద్యలను, కళలను, అభిమానించి పోషించారు. ముఖలింగం, శ్రీకూర్మం, పూరీ జగన్నాథాలయం, కోణార్క సూర్యదేవాలయం వంటి దేవాలయాలను నిర్మించిన వారు యీ గంగవంశపు రాజులే. కాళింగులు మిక్కిలి సాహస కార్యాలను గూడా చేసేవారు; సముద్రయానం చేసి బర్మా మలయా, జావా, సుమత్రా వంటి దూర దేశాలతో వ్యాపారం చేశారు. క్రీస్తుశకం ఎనిమిది, తొమ్మిది, పదవ శతాబ్దాలలో జావా ద్వీపాన్ని పరిపాలించిన శైలేంద్ర వంశపు రాజులు కళింగ దేశీయులే.

## సమగ్రమైన తెలుగు రాజ్యం

చాళుక్య రాజరాజ నరేంద్రుని తర్వాత వేంగీ రాజ్యం చిక్కుల్లో పడిపోయింది. రాజరాజ నరేంద్రుని కొడుకు రాజేంద్ర చోళుడికి మేనమామలతో గాఢమైన సంబంధం. అందువల్ల ఆయనకు అరవలతో పొత్తు ఎక్కువయింది. కన్నడ రాజ్యానికి అప్పుడు త్రిభువనమల్ల విక్రమాదిత్య మహారాజు ఆధిపత్యం వహిస్తుండేవారు. ఈయన పశ్చిమ చాళుక్య వంశజుడు. అప్పుడు తెలంగాణా ప్రాంతం పశ్చిమ చాళుక్య పాలనలో వుండేది.

తెలంగాణా వైపునుండి తేలికగా దండెత్తి వేంగీ రాజ్యాన్ని ఆక్రమించుకోవడానికి కన్నడ ప్రభువు గట్టి ప్రయత్నం చేస్తుండేవాడు. కాని యీ ప్రయత్నాలు విజయవంతం కాలేదు. కొన్నాళ్ళకు పూర్వాంధ్ర దేశమంతా చిన్నచిన్న నాడులతో చిన్నచిన్న రాజ్యాలతో ఛిన్నాభిన్నం కాసాగింది. ఇదే సమయాన కన్నడ సామ్రాజ్యానికి సామంతులుగా తెలంగాణాను పరిపాలిస్తున్న కాకతీయ ప్రభువులు స్వతంత్రులవుతున్నారు. ఛిన్నాభిన్న మవుతున్న తెలుగు ప్రాంతాలన్నిటిని స్వాధీనంచేసుకుని ఆ క్లిష్ట సమయంలో కాకతీయ గణపతిదేవ చక్రవర్తి సమగ్రాంధ్ర రాజ్యానికి స్థాపన కావించాడు. తెలుగువారి చరిత్రలో యిది నిజంగా చరిత్రాత్మక ఘట్టం. తూర్పు ఆంధ్రంలోని మండలేశ్వరుల బహునాయకత్వపు పరిపాలనలో కొన్ని మంచిపనులు జరగకపోలేదు. ఆనాడు దేవాలయ నిర్మాణం



తిరుపతి దేవాలయం

ఒక చక్కని కళగా రూపొందింది. శిల్పంతో పాటు సంగీతం నృత్యం క్రొత్త అందాలను సంతరించుకోసాగినవి. వేదవిద్యలు శాస్త్రాలు ప్రజల్లో ప్రాచుర్యం పొందినవి.

కాకతివంశంవారు కాకతీయులు. కాకతీయుల మూల పురుషుడు బేతరాజు. ఈయన కొడుకు ప్రోలరాజు: ప్రోలరాజు కొడుకు రెండవ బేతరాజు. రెండవ బేతరాజు కొడుకు రెండవ ప్రోలరాజు. వీరందరు అనుమకొండ (నేటి హనుమకొండ) రాజధానిగా, పశ్చిమ చాళుక్యులకు సామంతులుగా తెలంగాణా ప్రాంతాన్ని పరిపాలిస్తుండేవారు. పశ్చిమ చాళుక్యుల నుండి స్వతంత్రం కావడానికి రెండవ ప్రోలరాజు చేసిన ప్రయత్నం ఫలించింది.

గణపతిదేవ చక్రవర్తి క్రీ. శ. 1199 లో రాజ్యాధికారం స్వీకరించాడు. ఆయన రాజ్యాధికారం చేపట్టిన తరువాత కాకతీయ రాజధాని హనుమకొండ నుండి ఓరుగల్లుకు మారింది. వరంగల్లులో గణపతిదేవ చక్రవర్తి గొప్పకోటను కట్టించాడు. అది మహమ్మద్ ఘోరీ దండయాత్రలు జరుపుతున్న సమయం. పరదేశీయుల దండయాత్రలను తట్టుకోవడానికి వీలుగా తెలుగుదేశాన్నంతటినీ ఒక పటిష్టమైన మహాసామ్రాజ్యం క్రిందికి తీసుకొచ్చే ప్రయత్నం మొట్టమొదటిసారి చేసినవాడు గణపతిదేవ చక్రవర్తి.

నెల్లూరును పాలించిన తెలుగు చోళరాజు మనుమసిద్ది ఆస్థానంలో ఉన్న తిక్కన మహాకవి తన పదిహేను పర్వాల ఆంధ్రమహాభారతాన్ని పూర్తిచేసినది ప్రప్రథమంగా విన్పించినది ఓరుగల్లు కోటలోని గణపతిదేవుని కొలువులోనే. నెల్లూరి తిక్కన్న మహాకవికి ఓరుగల్లులోని కాకతీయ గణపతిదేవుడు తనవాడుగా, తనను ఆదుకొనేవాడుగా, తనవాణిని ఆకర్ణించేవాడుగా కన్పించాడు. గణపతిదేవ చక్రవర్తి సర్వవిధాలా సమర్థుడు; అన్ని విధాలా అడ్డులేనివాడు; శౌర్యంలో సాటిలేనివాడు; ధైర్యంలో అత్యున్నత శృంగం వంటివాడు. ఉత్తరాన కళింగం మొదలుకొని దక్షిణాన చెంగల్పట్టు వరకు గణపతిదేవుని శౌర్యానికి తలవొగ్గింది కంచిలో ఆనాడు కాకతీయుల ప్రతినిధిగా తెలుగుబిడ్డ కత్తిపట్టి రాజ్యం నడిపాడు ఆనాడు తెలుగుతేజము కోటి వెలుగులతో దీపించేంది. కాకతీయులు నూటికి నూరు పాళ్ళు స్వచ్ఛమైన తెలుగు రాజులు గణపతిదేవ మహారాజా ఆంధ్ర చక్రవర్తి. విద్యానాథుడన్నట్టు ఓరుగల్లు ఆంధ్రనగరం. తెలుగు మహాసామ్రాజ్యాన్ని అరవై రెండు సంవత్సరాలు అఖండవైభవంతో పరిపాలించాడు గణపతిదేవుడు

## కాకతి రుద్రమ - పరాక్రమ పతాక

గణపతి దేవునికి కొడుకులు లేరు రుద్రమదేవి ఆయనకు ఒకే ఒకకూతురు. రుద్రమదేవి రాజసంలో పరాక్రమంలో, రాజనీతిజ్ఞతలో తండ్రికి తగినబిడ్డ, తండ్రికి మించిన బిడ్డ. గణపతిదేవుని తరువాత కాకతీయ మహాసామ్రాజ్యానికి వీర రుద్రమదేవి మహారాణి అయింది. రుద్రమదేవి తన శక్తిసామర్థ్యాలతో, శౌర్యప్రతాపాలతో శత్రు సంహారం చేసింది. భారతీయులకు ఝాన్సీ రాణిలా తెలుగువారికి వీరరుద్రమదేవి పరాక్రమ పతాక. రాణి రుద్రమదేవి ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలించింది: ఆమెది ప్రజానురంజకమైన పరిపాలన. రుద్రమదేవి మనుమడు ప్రతాపరుద్రదేవ మహారాజు. ఆయన నాయకత్వాన తెలుగు సేనలు కంచినేగాక మరింత దక్షిణాన ఉన్న తిరుచునాపలివరకు గల దేశాన్ని హస్తగతం చేసుకొన్నవి. వీరరుద్రునివలె భాసించిన యీ ప్రతాపరుద్రదేవ చక్రవర్తి కాలంలో ఢిల్లీ సుల్తానులు లక్షలాది సైన్యంతో చాలాసార్లు ఓరుగంటి మీదికి దండెత్తి వచ్చారు. ప్రతాపరుద్రుని కదన పాండితిని తట్టుకోలేక ఢిల్లీ సుల్తానుల సైన్యాలు ఎన్నోసార్లు పిరికిపందలవలె పారిపోవడం జరిగింది. అయితే అదృష్టం కలిసిరాక క్రీ. శ. 1323 లో జరిగిన

యుద్ధంలో ప్రతాపరుద్రుడు ఢిల్లీ సులానులకు పట్టుబడ్డాడు. ముసల్మాను సర్దారులు ఆయనను ఢిల్లీకి ఖైదీగా తీసుకొని పోతుండగా ఆ అవమానాన్ని భరించలేక ఆ మానధనుడు ఏదో విధంగా నర్మదానదీతీరంలో ఆత్మహత్య చేసుకొన్నాడు. ఓరుగల్లు కోటతో పాటు తెలుగుదేశమంతా ఢిల్లీసుల్తానుల వశమయింది తెలుగు తేజము తిరిగి చిన్నబోయింది.

కాకతీయుల మహామంత్రి. మహారాజనీతి దురంధరుడు శివదేవయ్య గొప్ప శివభక్తుడు. ఆ కాలంలో దానాలు, వ్రతాలు, శిల్పకళ, సంగీతం, నృత్యం, శాస్త్రాధ్యయనం, సాహిత్యం, యుద్ధతంత్రం, వ్యవసాయం, వర్తకం, చిత్రలేఖనం, వినోదాలు, వేడుకలు, సుఖజీవనం మొదలైనవి వేయి ముఖాలతో విస్తరించినవి. ఓరుగల్లుకోట, వేయిస్తంభాలగుడి, రామప్పగుడి, పాకాల లక్నవరం, రామప్ప తటాకాలు కాకతీయులనాటి మహోజ్వల చరిత్రకు మచ్చుతునకలు. గణపతిదేవ మహారాజు వద్ద సేనాపిగా



తోలు బొమ్మలు

ఉండి వృత్తరత్నావళి రచించిన జాయపసేనాని స్వయంగా మనోహరమైన నాట్యం చేసేవాడట. అన్ని రంగాల్లోను అపూర్వమైన అభ్యుదయాన్ని సాధించిన కాకతీయ మహాసామ్రాజ్యం తెలుగు వారి చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించ దగినట్టిది.

కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజు బందీ కావడంతో క్రీ. శ. 1323 లో కాకతీయ సామ్రాజ్య భానుడు అస్తమించాడు. తిరిగి తెలుగుదేశం ముక్కచెక్కలయింది; గణపతిదేవ చక్రవర్తి కట్టిన సౌధం శిథిలమయింది. తరువాత గోదావరి ఒడ్డున ఉన్న రేకపల్లి రాజధానిగా మునునూరి ప్రోలానేడు, తెలంగాణా ప్రాంతంలో ఓరుగల్లు రాజధానిగా యీయన పినతండ్రి కొడుకు కాపానేడు. తుంగభద్రా నదీ ప్రాంతంలో, రాయలసీమలో_విజయనగరం రాజధానిగా క్రీ.శ. 1335_36లో హరిహరరాయలూ ఆయన సోదరుడూ స్వతంత్ర తెలుగు రాజ్యాలు స్థాపించారు. తెలుగుదేశం అంతా మహమ్మదీయుల పాలననుండి స్వతంత్రమైనది; కాని కాకతీయుల కాలంలో వలె ఒక్కటిగా రూపొందలేదు. ఇదే సమయాన క్రీ. శ. 1347లో దక్కనలో బహమనీరాజ్యం ఏర్పడింది. తెలంగాణాలోని రాచకొండలో రేచర్ల అనవోతానేని రాజ్యం; గుంటూరులోని అద్దంకిలో వేమారెడ్డి రాజ్యం వెలసినవి పద్నాలుగవ శతాబ్ది చివరి భాగాన తెలుగుదేశం అంతా కొన్ని ముఖ్య రాజ్యాల క్రింద చీలిపోయింది. అందుకే అప్పుడు మనం కాకతీయులనాటి అఖండసామ్రాజ్య ప్రాభవానికి నోచుకోలేక పోయాము. అనవోతారెడ్డి రాజధానిని అద్దంకినుండి కొండవీటికి మార్చాడు.

## వసంతం వచ్చింది

రెడ్డిరాజుల కాలంలో సంగీతం, సాహిత్యం, నృత్యం వంటి కళలు బాగా పెంపొంది రాణించినవి. రెడ్డిరాజులు సంస్కృతాంధ్రాలు క్షుణ్ణంగా చదివి పాండిత్యం సంపాదించినవారు. కొమరగిరిరెడ్డి సంస్కృతంలో 'వసంత రాజీయం, అనే పేరుతో నాట్యశాస్త్రాన్ని రచించాడు. ఈయనకు వసంత రాజని గూడా పేరు; కొమరగిరి సార్థకనామధేయుడు. కాళిదాస మహాకవి సంస్కృత నాటకాలకు గొప్ప వ్యాఖ్యానం వ్రాసిన కాటయవేమారెడ్డి గొప్ప సంస్కృత విద్వాంసుడు. పెదకోమటి వేమారెడ్డి సంస్కృతంలో మహాపండితుడు, కవి; సంగీతంలో, సాహిత్యంలో అందెవేసిన చేయి రెడ్డిరాజులు సంగీత, సాహిత్యాలనే గాక ఆయుర్వేద, జ్యోతిశ్శాస్త్రాలను గూడా ఘనంగా పోషించారు. ఎఱ్ఱాప్రగడ, శ్రీనాథుడు యీకాలంవారే. రెడ్డిరాజుల కాలాన్ని ఆంధ్ర వాఙ్మయానికి వసంత కాలంగా వర్ణించవచ్చు. అవచి తిప్పయసెట్టి వంటిగొప్ప వర్తకుల ఆధ్వర్యాన తూర్పు ఆసియా దేశాలతో సముద్ర వర్తకం పెద్ద యెత్తున సాగుతుండేది. కాకతీయ గణపతి దేవుడు తదితర కాకతీయ ప్రభువుల కాలంలో మోటుపల్లి ఓడరేవు ఎంత క్రమబద్ధంగా, ఎంత సంరంభంతో ఉండేదో తిరిగి అదే పరిస్థితి రెడ్డిరాజుల కాలంలో మోటుపల్లి రేవులో యేర్పడింది. మోటుపల్లి విషయంలో మల్లారెడ్డి ప్రత్యేక శ్రద్ధ చూపాడు. శ్రీశైలానికి పాతాళగంగకు సోపానాలుకట్టించి యాత్రికులకు గొప్ప ఉపకారం చేసిన పరమభక్తుడు వేమారెడ్డి ప్రభువు.

రెడ్డి రాజుల వలెనే వారికి సమకాలికులైన రాచకొండ రాజులుగూడా సంగీత, సాహిత్యాలను ఎంతో అభిమానించారు. తెలుగు కవులు, సంస్కృత కవులు రాచకొండ రాజుల ఆదరాభిమానాలను, గౌరవ సన్మానాలను అపరిమితంగా అందుకున్నారు. అనవోతానేని మనుమడు కుమార అనవోతానేడు సంస్కృతంలో చాలా గొప్ప పండితుడు. ఈయన నాటకాలను, సంగీత అలంకార శాస్త్ర గ్రంథాలను సైతం వ్రాశాడు. రాచకొండ ప్రభువు సర్వజ్ఞ సింగమహాభూపాలుని గురించి శ్రీనాథ మహాకవి స్వయంగా ప్రపంచానికి చాటిచెప్పాడు. సింగభూపాలుని సమకాలికుడే తెలుగు వారి నోముల పంటగా తెలంగాణా తేనె మాగాణంలో పుట్టిన మహాకవి పోతన్న.



# వెండి నగిషీ పరిశ్రమ

బంగారంపైన ప్రజలకు యెంత మోజు వుంటుందో వెండి పైనకూడా అంతే మోజు వుంటుంది. వెండి మధ్య తరగతి కుటుంబాలకు అందుబాటులో వుంటుంది. వెండి పనితనంలో కంసాలీలు సిద్ధహస్తులు. భారతదేశంలో చాలామంది కంసాలీలు అనేక రకాల వెండి ఆభరణాలు, పాత్రలు తయారు చేస్తారు. దేవాలయాలలో వివాహాదులు, ఇతర పండగ సందర్భాలలో వెండి పాత్రలు తప్పనిసరిగా ఉపయోగించబడుతాయి.

ఆభరణాల తయారీలో ఫిలిగ్రీ పనితనం అత్యుత్తమ స్థానం వహిస్తుంది. పల్చని వెండి రేకుపైన అతిసున్నితమైన ఫిలిగ్రీ పనితనం ఉంటుంది. ఒక్కొక్కసారి ఇందులో బంగారంకూడా ఉపయోగించబడుతుంది. సొరెగూడులో ఉండే అందం ఆకర్షణ ఫిలిగ్రీ పనితనంలో ద్యోతకమవుతుంది. పూర్వకాలంలో సున్నితమైన పనితనానికి యువకుల చేతులు అనుకూలంగా ఉండవు కనుక చిన్న పిల్లలను ఉపయోగించేవారు.

ఒరిస్సాలో కటక్‌లోను, ఆంధ్ర ప్రదేశ్‌లో కరీంనగర్‌లోను, బెంగాల్‌లో ముర్షిదాబాద్‌లోను–ఈ మూడు ప్రధాన కేంద్రాలలో వెండిఫిలిగ్రీ తయారవుతుంది. కటక్ ఫిలిగ్రీలో యంత్రాలు ఉపయోగించబడుతాయి. కనుక ఇది చేతి పరిశ్రమకంటే, యంత్ర పరిశ్రమకు సన్నిహితంగా వుంటుంది. కరీంనగరంలో చిన్న యంత్రాల సహాయంతో, వెండి తీగెలు తయారుచేసి సిద్ధహస్తులైన నిపుణులు చేతితో ఫిలిగ్రీ పని చేస్తారు.

సుమారు 200 ఏండ్ల క్రిందట ఎలగండ జిల్లా ప్రధాన కేంద్రంగా వుండినపుడు కరీంనగరంలో వెండి ఫిలిగ్రి పరిశ్రమ అవతరించింది. కొంతమంది కంసాలీలు ఈ పనితనంలో ప్రత్యేక నిపుణత సంపాదించారు. తరాలు గడిచినకొద్దీ ఈ పనితనానికి అందం, ఆకర్షణ చేకూరినాయి. సున్నితమైన అనేకమైన వస్తువులలో అత్యున్నత స్థాయిగల పనితనం కనిపిస్తుంది. ఈ వస్తువులు నేత్రానందం కల్గించడమేకాకుండా ఉపయోగకరమైనవికూడా.

కరీంనగరం జిల్లా ప్రధాన కేంద్రంగా మారిన తరువాత, ఇక్కడ అనేక సౌకర్యాలు ఏర్పడిన కారణాన వెండి ఫిల్రిగీ నిపుణులు ఇక్కడికి చేరినారు. ఆ కాలంలోని వెంకటేశం, వెంకట్రామయ్య అనే ఇద్దరు పనివారలను ఇప్పటి వెండి ఫిల్రిగీ పనివారలు నేటికికూడా తలచుకొంటారు. ఇక్కడికి తరలివచ్చిన వెండి ఫిల్రిగీ పనివారల ఉపయోగార్థం కరీంనగరం సుబేదారు "కోట బజారు" అనే ప్రాంతాన్ని అంతటినీ కేటాయించాడు. 1930 లో శ్రీ షేక్ యావర్ అలీ అను తహశీలారు కటక్‌నుంచి కొన్ని ఫిలిగ్రి వస్తువులు తన వెంట తెచ్చాడు. దీన్ని ఆధారంగా చేసుకొని అనేక క్రొత్త డిజైనులు తయారైనాయి. పనితనంలో క్రొత్త పద్ధతులు ప్రవేశపెట్టబడినాయి. కటక్ ఫిలిగ్రి పనిలో ఒక చతురస్రపు తీగె ఉపయోగించబడుతుంది. కరీంనగరం ఫిలిగ్రి పనిలో రెండు గుండ్రని తీగెలు అల్లుకొనివుంటాయి. ఈ రెండు ఫిలిగ్రి పనులలోవుండే ముఖ్యమైన తారతమ్యం ఇదే.

హైదరాబాదు నిజాము ఆయన తండ్రి వెండి ఫిలిగ్రి పరిశ్రమను పోషించి ప్రోత్సహించారు. అఖిల భారత వస్తు ప్రదర్శనలో ఈ వస్తువులకు బంగారు బహుమతులు ప్రశంసా పత్రాలు లభించాయి. 1925 లో అఖిల భారత బొంబాయి వస్తు ప్రదర్శనశాలలో ప్రత్యేకంగా వెండి ఫిలిగ్రీ వస్తువులు ప్రదర్శింపబడ్డాయి. ఇవి ప్రజలను బాగా ఆకర్షించాయి. వారి మెప్పును పొందినాయి.

ఫిలిగ్రి పనికి కల్తీ లేని వెండి ఉపయోగించబడుతుంది. దీనిని సన్నని తీగెలుగాతీసి వాటితో కావలసిన ఆకారంలో వస్తువులు తయారుచేయబడుతాయి. ఈ పనితనానికి ఎంతోశ్రమ అవసరం. చాలనేర్పరితనం కూడా వుండాలి. పక్షులు, పువ్వులు సెంటుసీసాలు, సిగరెట్టు పెట్టెలు కేసులు, సున్నితమైన ఆభరణాలు మున్నగు అనేక రకాల వస్తువులు ఫిలిగ్రిలో తయారవుతాయి.

శాస్త్రీయ పద్ధతులలో ఈ పరిశ్రమను నడిపించి, ఆర్థిక సౌకర్యాలను అభివృద్ధి పరచే ఉద్దేశంతో కరీంనగరంలోని వెండి బంగారం పనివారలు 1953లో 'తర్కషాన్' పారిశ్రామిక సహకార సంఘాన్ని స్థాపించారు. ఈ సహకార సంఘం ఈ పరిశ్రమను సక్రమంగా నిర్వహించి దాని ఆర్థికాభివృద్ధికి కృషి చేస్తున్నది. వస్తువుల మార్కెటింగును పెంపొందించింది. అభివృద్ధి దశలో ఏర్పడిన క్లిష్టపరిస్థితిని నివారించేందుకు అప్పులు గ్రాంట్ల రూపంలో ప్రభుత్వ సహాయం లభించింది. వెండి ఫిలిగ్రి పరిశ్రమకు స్థిరత్వం చేకూర్చడానికి ప్రభుత్వ సహాయం ఉపకరించింది.

వెండి ఫిలిగ్రి బాగా ప్రచారంలోకి వచ్చింది. స్వదేశంలోను, విదేశాలలోను ఈ వస్తువులకు మంచిపేరు వచ్చింది. వెండితో ఆకర్షణీయమైన అందమైన ఆభరణాలు తయారుచేయవచ్చని ఈ పరిశ్రమ రుజువుచేసింది. అనేకమంది కళాకారులకు ఉపాధి కల్పించింది. సుందర వెండినగిషీ వస్తువులు అనేక గృహాలను అలంకరించినాయి. వెండి నగిషీవస్తువులతో అలంకరించబడిన అనేక భవనాలలో న్యూఢిల్లీలోని రాష్ట్రపతి భవనంఒకటి. (శ్రీ యం. యస్. ఉపాధ్యాయ రచించిన "భారతదేశపు చేతి పరిశ్రమలు" అనే గ్రంథం నుండి)

# సర్ ఆర్థర్ కాటన్



జలధి పాలవుతున్న జలాలను
పొలాలకు మళ్లించిన
అపర భగీరథుడు

గోదావరీ జనని దివ్యానుగ్రహానికి పాత్రమైన భాగ్య భూమి తూర్పు గోదావరి జిల్లాలోని కోనసీమ. పాదులతో, బోదెలతో, పైరు చేలతో, పంటచేలతో, అరటులతో, చెరకులతో, తమలపాకులతో, తాళవృక్షాలతో, పోకలతో కొబ్బరితోటలతో, నదీ శాఖలతో, కాల్వలతో కల కలలాడే బంగారు సీమ కోనసీమ. భాగ్య లక్ష్మికీ, అన్నపూర్ణకూ ఈనాడు ఆటపట్టయిన ఈ ప్రాంతంలో దాదాపు 120 సంవత్సరాల క్రిందట క్షామ పిశాచం తాండవిస్తూ ఉండేది. కరువు దయ్యానికి ఉచ్చాటనం పలికి మహా లక్ష్మికి మంగళ ఆహ్వానం చెప్పిన మంత్ర వేత్త సర్ ఆర్థర్ కాటన్.

బ్రిటిషు పరిపాలన కాలంలో పాఠశాలా విద్యార్థుల పరీక్ష పత్రాలలో ఒక ప్రశ్న తరచు కనుబడుతూ వుండేది. ఆ ప్రశ్న "బ్రిటిష్ పరిపాలనవలన మన దేశమునకు జరిగిన లాభములేవి?" బ్రిటిషు పరిపాలన వలన కలిగిన ఇతర లాభాల మాట ఎలా ఉన్నా భారత దేశానికి— ముఖ్యంగా దక్షిణ భారత దేశానికి— ప్రాప్తించిన ఒక గొప్ప లాభం సాగు నీటి సౌకర్యం. బ్రిటిషు ప్రభుత్వం నిర్మించిన ఆనకట్టలలో అత్యంత ప్రాచీనమైనవి, దక్షిణ భారత నదులపై నిర్మించినవి. వాటి రూపకల్పనకూ నిర్మాణానికీ సర్ ఆర్థర్ కాటనుకు మన దేశం ఎప్పటికీ కృతజ్ఞమై ఉంటుంది.

కాటన్ మొట్ట మొదట నిర్మించినవి కావేరి కాలరూన్ నదులమీది ఆనకట్టలు వాటి ధర్మమా అని తమిళనాడులో తంజావూరు తిరుచిరాపల్లి జిల్లాలు సస్యశ్యామలా లయ్యాయి. కృష్ణా నదిమీది ఆనకట్టకు రూపకల్పన చేసినవాడు ఆర్థర్ కాటన్ మహాశయుడే.

ఇక గోదావరి ప్రాంతానికీ—తద్వారా ఇతర ప్రాంతాలకూ ఆయన చేసిన మేలు ప్రత్యేకంగా చెప్పుకోదగినది. గోదావరి ధవళేశ్వరం దగ్గర గౌతమి, వశిష్ఠ అనే రెండు పాయలుగా చీలిపోతూ ఉంది. ధవళేశ్వరం దగ్గర అఖండ గోదావరిమీద 120 సంవత్సరాలుగా ఉంటున్న ఆనకట్ట కాటన్ నిర్మించినదే. ఆ నిర్మాణ ఫలితంగా వందల మైళ్ళ కాల్వల ద్వారా సాగునకు నీరు లభిస్తుంది. లక్షల ఎకరాలలో బంగారు పంట పండుతూ ఉంది.

ఈ నాటి విజ్ఞాన ప్రగతిలో పోల్చితే ఆనాటి ఇంజినీరింగ్ శాస్త్రమూ, సాంకేతిక పరిజ్ఞానమూ ప్రాథమిక దశలో ఉండిన వనే చెప్పాలి. అపూర్వమైన నిర్మాణ కౌశలాన్నీ సేవాసక్తినీ చూపి దేశానికి—ముఖ్యంగా తెలుగు దేశానికి— కాటన్ చేసిన ఉపకారం మరువరానిది. గోదావరి కాల్వ నీరు తాగుతున్నప్పుడు గోదావరిడెల్టా పొలాల్లో పండిన పంటలను తింటున్నప్పుడల్లా అది ఆర్థర్ కాటన్ ఉపకారమే అని మనం జ్ఞాపకం చేసుకోవాలి.

గోదావరి నదిమీద నిర్మింప బడనున్న బారేజికి ఆంధ్ర ప్రదేశ్ ముఖ్య మంత్రి గత మాసం శంకు స్థాపన చేశారు. ఆ కొత్త బ్యారేజికి కాటన్ మహాశయుని పేరు పెట్టుకొంటున్నాం. చంద్రునకు నూలుపోగు అన్నట్లు అంతకంటే మనం చేయగలిగిన దేముంది.

—కల్యాణసింగ్



# సర్ ఆర్థర్ కాటన్ బ్యారేజి

గోదావరిమీద, రు 25 కోట్ల ఖర్చుతో నిర్మించ దలచిన సర్ ఆర్థర్ కాటన్ బ్యారేజికి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డిగారు ఏప్రిల్ 11వ తేదీన శంఖుస్థాపన చేశారు. 124 సంవత్సరాలక్రితం కట్టిన గోదావరి అనకట్టకు 45 మీటర్ల ఎగువన నిర్మించ దలచిన యీ బ్యారేజివల్ల, ఆంధ్రప్రదేశ్‌లో వరి పంట కేంద్రమై, దేశమంతా ప్రసిద్ధిచెందిన గోదావరి జిల్లా ప్రాంతం యింకా సౌభాగ్యవంతమవుతుంది. పాత ఆనకట్ట నిర్మించిన ప్రతిభావంతుడు సర్ ఆర్థర్ కాటన్‌కు కృతజ్ఞతా సూచకంగా బ్యారేజికి ఆయన పేరుపెట్టారు.

శంఖుస్థాపనోత్సవ సమయంలో, కేంద్ర నీటి పారుదల, విద్యుచ్ఛక్తి మంత్రి డా. కె. యల్. రావు, ఉపముఖ్యమంత్రి జె.వి. నరసింగరావు, రాష్ట్రప్రభుత్వ నీటిపారుదల మంత్రి శ్రీ శీలంసిద్దారెడ్డి, పంచాయత్ రాజ్ మంత్రి శ్రీ తోట రామస్వామి, ఆబ్కారీ మంత్రి సాగి సూర్యనారాయణరాజు ప్రభృతులు హాజరైనారు.

## ఎదుటిపేజీలో

(ఎడంవైపు పైన) ఇప్పుడున్న అనకట్ట

(క్రింద) : సర్ ఆర్థర్ కాటన్ విగ్రహాన్ని ముఖ్యమంత్రి పూలమాలతో అలంకరించడం.

(కుడివైపున) సర్ ఆర్థర్ కాటన్ బ్యారేజి మోడల్

(క్రింద) ప్రారంభోత్సవానికి ముందు ముఖ్యమంత్రి పూజచేస్తున్న దృశ్యం.

## ఈ పేజీలో

(పైన) ముఖ్యమంత్రి కొబ్బరికాయ కొడుతున్న దృశ్యం

(క్రింద) ముఖ్యమంత్రి గంగపూజ చేస్తున్నారు.



# ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు

—జి. రాజన్న

గొప్ప ప్రజానాయకుడు, ఆంధ్రరాష్ట్ర ప్రథమ ముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు, 1957 మే 20వ తేదీన హైదరాబాదులో నిర్యాణం జెందారు.

ఆనాడు 1952 మే 6వ తేది—ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో రాజ్యాంగ బద్ధంగా ఎన్నికైన మొట్టమొదటి శాసనసభ సమావేశమైంది ఆరోజు. సభ, సభ్యులతో నిండిపోయింది. ప్రేక్షకుల గ్యాలరీ క్రిక్కిరిసింది. అప్పుడు రాజాజీ ముఖ్యమంత్రిగా వున్నారు. సభలో ప్రసంగించడానికి గవర్నరు నుంచోగానే 80 సంవత్సరాల వృద్ధుడు శ్రీ ప్రకాశం దిగ్గున లేచి నిలబడ్డారు. ఆ సన్నివేశం మేఘాలు క్రమ్మిన ఆకాశంలో మెరుపు మెరిసినట్లనిపించింది. సభ వారి కళ్లు మిరుమిట్లు క్రమ్మాయి. గవర్నరు కూర్చున్నారు. "సి.ఆర్." ను ముఖ్యమంత్రిగా నియమించడం ద్వారా రాజ్యాంగ నిబంధనలను ఉల్లంఘించడం జరిగిందని ప్రకాశం కోర్టు తీర్పువలె వక్కాణించారు.



తరువాత ఆయన నూరుమంది అనుచరులతో కలిసి సభ నుంచి నిష్క్రమించారు. అప్పుడు గవర్నరు ప్రసంగించారు. వారం రోజుల తరువాత గవర్నరు ప్రసంగానికి "అంతరాయం" కలిగించడం ద్వారా హక్కులకు భంగం కలిగించినందుకు గాను ప్రకాశాన్ని కఠినంగా హెచ్చరించాలని రాజాజీ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. అయితే తరువాత దానిని ఉపసంహరించుకున్నారు.

దక్షిణదేశ ప్రజాజీవితంలో ప్రకాశం అజేయుడుగా రూపొందడానికి గల కారణమేమిటి ? అందలి రహస్యమేమిటి ? ఆయన చర్యలను ఘనమైనవిగా పరిగణించినా, పరిగణించక పోయినా, అసాధారణమైన, సహజ సిద్ధమైన శక్తి కలిగిన వ్యక్తిగా ఆయనను అంగీకరించక తప్పదు. ఆయనలో మూర్తీభవించిన నిర్భయత్వం ఆయనకు విశిష్టతను చేకూర్చింది.

1920 వ సంవత్సరంలో గాంధీజీ "సత్యం, అహింస, నిర్భయత్వా." అనే సూత్రత్రయం ప్రాతిపదికపై జాతికి ఉద్యమపు పిలుపు యిచ్చినప్పుడు దానిని ముందుగా శిరసావహించిన వారిలో ప్రకాశం ఒకరు ఆయన చిన్నతనంలోనే వ్యాయామ విద్యలో ఆరితేరారు. ప్రకాశం వంటి ఆవేశ పూరితుడైన వ్యక్తి, గాంధీజీ అహింసా సిద్ధాంతాన్ని అనుసరించడం అపూర్వమైన విషయం.

మద్రాసు హైకోర్టులో ప్రముఖ న్యాయవాదిగా పేరుపొంది దండిగా ఆర్జిస్తున్న ప్రకాశం అవృత్తిని త్యజించి స్వాతంత్ర్యోద్యమంలోనికి ప్రవేశించారు. దేశానికై తన సర్వస్వాన్నీ త్యాగం చేశారు. ఇట్టి నిస్వార్థ త్యాగంలో ఆయనకు సాటి వచ్చే వారు పండిట్ మోతీలాల్ నెహ్రూ. దేశబంధు చిత్తరంజన్ దాస్ గారలు మాత్రమే జైలులో వున్నా. లాఠీదెబ్బలు తినవలసి వచ్చినా, బుల్లెట్లకు గురికావల్సి వచ్చినా ప్రకాశం నిర్భయంగా ప్రవర్తించి సాహసోపేతుడుగా ఖ్యాతిగాంచారు.

## ఆంధ్రకేసరి గర్జించింది

1929లో సైమన్ కమిషన్ మద్రాసుకు వచ్చినపుడు, ప్రభుత్వం ప్రజా ప్రదర్శనలను నిషేధిస్తూ సైనిక చట్టాన్ని అమల్లో పెట్టింది. ఈ చర్యకు కొంతమంది కాంగ్రెసు నాయకులు భయపడి దూరాలోచనతో సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలని నిర్ణయించారు. అయితే మహానాయకుని లక్షణాలుగల ప్రకాశం పంతులు ప్రభుత్వాన్ని యెదిరించకుండా వుండడం పిరికిపందల లక్షణమని భావించారు. ఆయన ధైర్యంతో ముందుకు నడిచి నిషేధ ప్రాంతంలో కాలుపెట్టి తుపాకులు కాల్చండని పోలీసులకు ఎదురుగా నిలబడ్డారు అయితే తెలివిగా ప్రభుత్వం వెనుకంజవేసి అక్కరలేని కమిషన్‌పట్ల నిరసన ప్రదర్శించడానికి ఆయనకు అనుమతి నిచ్చింది, ఆయన ధైర్యాన్ని ప్రజలు వేనోళ్ళ పొగిడి ఆయనకు "ఆంధ్ర కేసరి" అని బిరుదు ఇచ్చారు. ఆయనచనిపోయినపుడు, ఆయన సింహంవంటివాడని సి. ఆర్. అభివర్ణించారు.

ప్రకాశం పంతులు గుంటూరు జిల్లా (ఇప్పటి ఒంగోలు జిల్లా)లో పేద కుటుంబంలో జన్మించారు. చిన్నతనంలో అనేక ఇబ్బందులను ఎదుర్కొన్నారు. ధైర్యసాహసాలు ఆయనలో మూర్తీభవించి వున్నాయి. ఐశ్వర్యంతో తులతూగిన రోజులలో ఆయన దేశభక్తి ప్రపూరితుడైనాడు. గాంధీ సేవలో విశ్వాస పాత్రుడైన నాయకుడైనాడు. మాతృదేశ సేవకు ఎంత త్యాగం చేసినా తక్కువేనని ఆయన భావన. 50 ఏండ్ల క్రిందట ఆయన ఆస్తి విలువ ఆరున్నర లక్షలు వుండింది. అయితే విదేశీ పాలనకు వ్యతిరేకంగా సాగించిన పోరాటంలో ఈ ఆస్తినంతటినీ మనస్ఫూర్తిగా త్యాగం చేశాడు.

రాజనీతిజ్ఞత, రాజకీయపు ఎత్తులు లేనందువల్ల, ప్రజల అండదండలు ఆయనకు ఉన్నప్పటికీ ఆయన ఉన్నత పదవులను అధిష్టించలేదు. ఏదో కొద్దికాలం తప్ప. ఆయన గొప్ప ఆదర్శ వాది. నిర్మొహమాటంగా వుండే వ్యక్తి. అందుకనే, ప్రస్తుత పరిస్థితులనుబట్టి, ఆయన సమర్థపంతుడైన పరిపాలకుడుగా రాణించ లేదు. వాణిజ్య దృష్టితో, ఆయన ఆంగ్ల దినపత్రికను విజయవంతంగా నడిపించలేకపోయాడు. ఆయన రాజకీయవేత్త కాదు కాని గొప్ప దేశభక్తుడు. అందుకనే ఆయన మంత్రివర్గంలో విభేధాలు ఏర్పడి 1947లోను ఆ తరువాత 1954లోను ప్రభుత్వ పతనానికి దారి తీశాయి అయితే కుట్రలు, పిరికితనాన్ని సహించడం కంటే రాజకీయ ప్రాబల్యాలు లేకపోవడమే మంచిదని భావించాడు.

ఆ రోజులలో క్యాబినెట్ మంత్రులపైన శాసన సభలో అనేక అభియోగాలపైన తీర్మానాలు ప్రవేశ పెట్టకూడదని 1947లో కాంగ్రెసు అధిష్ఠానవర్గం ఆయనకు ఆదేశించింది. అయితే ఆయన ఈ ఆదేశాలను తిరస్కరించాడు. ఈ అభియోగాలను గురించి ప్రసంగించరాదని ఆయనకు మళ్ళీ ఉత్తరువులు వెళ్ళాయి. వీటిని కూడా ఆయన ఖాతరు చేయలేదు. ఇట్టి ఆదేశాలు ఉత్తరువులు వ్యక్తి, ప్రజల ప్రాథమిక హక్కులకు భంగకరమైనవని చాటి చెప్పాడు.

### అజాతశత్రువు

సమస్యలను అన్నింటినీ సమగ్రంగా పరిశీలించేవాడు కాని, విడివిడిగా చూచేవాడుకాదు ఆయన. అయితే ప్రకాశం పంతులు అజాత శత్రువు వంటివాడు. కాంగ్రెసు కానివ్వండి, కమ్యూనిస్టు కానివ్వండి, సోషలిస్టు కానివ్వండి, జస్టిస్‌పార్టీ వ్యక్తి కానివ్వండి, అందరూ ఆయనపట్ల గౌరవాభిమానాలు చూపేవారు. ఆయన గొప్ప నాయకుడని శ్లాఘించేవారు. ప్రజలకు ఆయనమీద అపారమైన ప్రేమాభిమానాలు వుండబట్టి, ఆంధ్రకేసరి 1953లో ఆంధ్ర రాష్ట్రానికి ముఖ్యమంత్రి అయినాడు. తన జీవితకాలమంతా ప్రకాశం అనేక క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొనవలసి వచ్చింది. అయితే ఆయనలో "భయం" "అలసట" అనేవి ఎక్కడా కనిపించవు. వృద్ధాప్యం వల్ల ప్రజాజీవితం నుంచి విరమించవలసిందని గాంధీజీ ఆయనకు హితవు చేశాడు. అయితే తనలో యువక ఉత్సాహం వుందనీ, చివరి వరకు దేశ సేవ చేస్తానని ఆయన సమాధానమిచ్చాడు.

"నా జీవితము సమాజానికి అంకితమైవుంది. నేను బ్రతికి వున్నంతవరకు, శక్తి వంచనలేకుండా సమాజానికి సేవ చేయడమే నా లక్ష్యం. ఆఖరి క్షణం వరకు సేవ చేయాలని నాకు వుంది."

మొక్కవోని ధైర్య సాహసాలను ప్రకాశం మనకు అందించాడు.

1957 మే 20వ తేదీన హైదరాబాదులో శాశ్వతంగా కన్నుమూసిన యీ ఆంధ్రకేసరిని మనం గౌరవ పురస్సరంగా స్మరించుదాం.

## అమరవీరుల జీవిత సంగ్రహం

### అల్లూరి సీతారామరాజు

పశ్చిమ గోదావరిజిల్లా మొగల్లు గ్రామంలో 1897 జూలై 4న జన్మించారు. విశాఖపట్నం జిల్లా ఏజెన్సీ ప్రాంతంలోగిరిజనుల కూడ గట్టుకుని బ్రిటిష్ పాలకులను యెదిరిస్తూ రాజకీయపోరాటం కొనసాగించాడు. బ్రిటీష్ పోలీసులు అధికారులు చేసిన దౌర్జన్య కాండను సహించ లేక ఆయన వారిపై సాయుధపోరాటం కొనసాగించారు. ఇది రంపా తిరుగుబాటు పేరుతో చరిత్ర ప్రసిద్ధిగాంచినది. ఆయన నాయకత్వాన్ని శిరసావహమున గిరిజన దేశభక్తులు అనేకసారులు బ్రిటిష్ పోలీసులపై విజయవంతంగా దాడులు జరిపారు. అల్లూరి సీతారామరాజు గొరిల్లా యుద్ధంలో సిద్ధహస్తుడు. యుద్ధవ్యూహంలో నిపుణుడు. బ్రిటీష్ సామ్రాజ్యాన్ని గడగడలాడించిన ధీరపురుషుడు. ఆయనను పట్టుకొన్నవారికి రూ. 10,000లు బహుమతిగా ఇస్తామని బ్రిటీష్ ప్రభుత్వం చాటింపువేసింది. బ్రిటీష్‌వారు గిరిజనులపై అనేక అత్యాచారాలు చేసి వారిని అతిక్రూరంగా హింసించారు. విధిలేని పరిస్థితులలో అల్లూరి సీతారామరాజు స్వయంగా బ్రిటీషువారికి లోబడిపోయారు. ఆయన ధర్మమూర్తి, శౌర్యమూర్తి. ప్రజలకు న్యాయం జరగాలని వారి హక్కులను కాపాడాలని ఆయన ఆశించాడు. 1924 మే 7వ తేదీన బ్రిటీష్‌వారు ఆయనను తుపాకు గుండ్లకు బలిచేశారు.

### అమ్మినేని సుబ్బారెడ్డి

గుంటూరు జిల్లా పరిమి గ్రామంలో జన్మించారు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 1942లో ఆగస్టు 12వ తెనాలి రైల్వేస్టేషన్‌పై జరిగిన సాయుధ దాడిలో పాల్గొన్నారు. ఆ రోజు జరిగిన పోలీసు కాల్పులలో తుపాకిగుండు దెబ్బతగిలి మరణించారు. "భారత దేశపు అమరవీరులు" గ్రంథంనుండి

# గుంటూరులో ఆంధ్రమహాసభ

## శ్రీ వి. వి. జోగయ్య పంతులుగారి అధ్యక్ష ప్రసంగం

గుంటూరులో జరిగిన యాంధ్ర మహాసభకధ్యక్షత వహించిన వి. వి. జోగయ్య పంతులుగారి యధ్యక్షోపన్యాసము నుండి—

మనవాండ్లు దేశోద్ధారణకు సహకారియగు పనులను కొన్ని చేయవలసి యున్నది. ఇందుకు ముఖ్యమగునది. గ్రామముల పునర్నిర్మాణమని నిశ్చయముగ చెప్పవచ్చును. పూర్వ కాలమునందు గ్రామములే మన రాజకీయ విధానమునకు ఆదర్శ ములుగా నుండెడివి. కాని ప్రస్తుతము ఆ గ్రామముల స్థితి చెడినది. ఇప్పుడు మన గ్రామస్థులు ఉండుటకిల్లుయు, కట్టుటకు బట్టయు, తినుటకు తిండియు లేక నిరుపేదలైరి. చిన్నచిన్న గవర్నమెంటు ఉద్యోగస్తుల దౌర్జన్యమునకు లోబడిరి. సాహుకార్ల వద్ద హెచ్చువడ్డీలకు ఋణములు దెచ్చిచెడిరి. ప్రతియింటను త్రిప్పబడుచుండెడి రాట్నము లడుగంటెను. నేతవృత్తి నశించెను. దుకాణములన్నియు విదేశపు వస్తువులతో నిండినవి. త్రాగుడు మత్తు పదార్థముల వాడుక హెచ్చినది. ఇట్టి వ్యసనములను మాని గ్రామ పునర్నిర్మాణము చేయనియెడల మనకు ఈ బీదతనము నుండి విముక్తి కలుగనేరదు.

## గ్రామనిర్మాణమునకు ముఖ్యమగునవి

(1) గ్రామపంచాయతీలు. (2) వడకుట, నేత మొదలగు పారిశ్రామికులు (3) వ్యవసాయము (4) విద్య (5) పారిశుద్ధ్యము (6) సహకారోద్యమము మొదలగునవి.

ఇట్టి గ్రామ పంచాయతీ గోదావరిజిల్లాలోని "ఆలమూరు" లో నున్నదని తెలిసి చాలాసంతసించితిని. గాని మొత్తమున యిట్టి పంచాయితీలు పూర్ణముగా నశించినవి. వీటిని పునరుద్ధరణ చేయు బాధ్యత మనయందే యున్నది. వీటిని జయప్రదముగా నడపవలెనన్న ప్రతిగ్రామ మందును సంఘముల నేర్పరచి పలుకుబడి గలవారినందుల సభ్యులుగా జేర్చవలెను. సంఘ సభ్యులు గ్రామస్థుల రాబడినుంచి, గ్రామవృద్ధి కొరకు ధనము పోగుజేయవలెను. ప్రతి కుటుంబము నుంచి వారి రాబడిని బట్టి పండిన ధాన్యములలో నూటికి 2 కుంచములు చొ॥ న ప్రజలకు యిబ్బంది గలుగని విధమున వసూలు చేయించి, అది సొమ్ముగా మార్చి ఒక నిధిని ఏర్పాటు చేయవలెను. గ్రామములో శుభకార్యము అగునపుడు సంభావన రూపముగ సొమ్ము జమచేసి దానిని గూడ నిధికి చేర్చవలెను. ఈ సొమ్ముతో పుస్తక భాండాగారములు, రాత్రి పాఠశాలలు, రాట్నములు, మగ్గములు మొ॥ ఉపయోగమగు వాటిని స్థాపించి యిట్టి సంఘముల సహాయమున పంచాయితీలను బలపర్చవలయును.

## దేశ పారిశ్రామికములు

దేశపారిశ్రామికములలో మన దేశమందు నూలువడకుట నేత ముఖ్యములు. ఈ పారిశ్రామికమెట్లు నశింపబడెనో యిదివరకే చెప్పియుంటిని. దీనిని తిరిగి వృద్ధిపరుపవలెనన్న ప్రతిగృహస్థుడును వాని పెరటియందు ప్రత్తి వేయవలెను. అందుల పెరుగు ప్రత్తి, యేకులుగా చేసి రాట్నముల నుంచి వడుకవలెను. ఆ దారముచే నేసిన వస్త్రములను ధరింపవలెను. ఇట్లు చేసినయెడల మనకు మన దేశమునకు గావలసిన బట్ట తయారు జేసుకొనుటయె గాక యితర ఖర్చులకు కూడ కొంత వరకు ఉపయోగపడ గలదు. ఇందువలన దేశమందలి కరువు కొంతతగ్గును. ప్రస్తుతము ఖద్దరు సాధారణులు ఉపయోగించుకుండుటకు దాని హెచ్చు ఖరీదే కారణము. ఇందువలన దేశమందలి బట్టల కరువు కొంత వరకు తగ్గును. ప్రతివారును నూలు వడుకుట వలన ఖద్దరు వృద్ధి అయి, అందుల ఖరీదు తగ్గును. సగటున ప్రతి హైందవ కుటుంబము నందును 5గురు జనాభా లెక్కల ప్రకారము యుండి యున్నారు. సాలుకు మనిషి 1కి దామాషాయిని 12 గజముల గుడ్డ వుపయోగపడుతున్నది. అనగా సంవత్సరమునకు ఒక కుటుంబమునకు గ. $5 \times 12 = 60$ గజముల గుడ్డ కావలెను. ఒక కుటుంబమునకు సాలుకు 60 గ॥ చొ॥ న నెలకు 5గజములు కావలయును. 10వ నంబరు నూలు 5 గ. లకు గ॥ 1కి $12\frac{1}{2}$ తులము చొ॥న $62\frac{1}{2}$ తులములు కావలయును. అన్ని రోజులును ప్రతి మనిషియు పని చేయజాలడు. 5 దినములు నెలకు నాగా క్రింద తీసివేసినను 25 దినములు ఒక నెలలో పని జరుగగలదు. పనిచేసిన యెడల రోజుకి 18 కావలసిన $(62\frac{1}{2}/25)2\frac{1}{2}$ తులములు. తులమునకు 10వ నెంబరు నూలు 210 గ॥లు వచ్చును. కాని $2\frac{1}{2}$ తులముల నూలుకు $(210 \times 2\frac{1}{2})$ 525 గ॥ దారము రాగలదు. 10వ నెంబరు నూలు గంటకు 260 గజములు వడకగల్గరు కాని రోజు 5గురు గల కుటుంబము వడకవలసినది 2 గంటలు.

అనగా ఒక కుటుంబములో నొక్కరొక్క $\frac{1}{2}$ గంట వడికినయెడల కుటుంబమునకు సాలీనా వడకు నూలు కావలసిన కొన వచ్చునని వీటితోపరిశ్రమ చేసినవారు చెప్పుచున్నారు.

## వ్యవసాయము

హిందూదేశముయొక్క యితర ప్రాంతములలో వలెనె మన ఆంధ్రదేశమందు గూడ ప్రధానము వ్యవసాయము. నూటికి 80 మందికి యిదే జీవనాధారము. ప్రస్తుతము 40 కోట్ల యకరముల భూమి మాత్రమే సాగులోనున్నది. అనగా మనిషి 1కి యకరము సాగుపడదు. సాగులాయకు భూమి యింకా 609 కోట్ల యకరములున్నది ఇదంతయు కాకపోయినను కొంతయైన త్వరలో సాగులోనికి తెప్పించు కర్తవ్యము గవర్నమెంటు వారిపై నున్నది. మన ప్రభుత్వము వారి శ్రద్ధ భూమి వృద్ధిపరచుట కంటె ఇనుపదారుల వృత్తిపై యెక్కువయున్నది. ఇనుపదారులపై వారు సాలుకు 658 కోట్ల రూపాయలే ఖర్చు చేయుచున్నారు. కాని భూములయొక్క జలాశ్రయ వృద్ధిపై 78 కోట్ల రూపాయలే ఖర్చు చేయుచున్నారు. ఈ ఖర్చు చేయు సొమ్మువలన గలుగు ఆదాయమును బట్టి చూచినను, రైళ్ళపై బెట్టిన మొత్తమునకు నూటికి 3 రూ॥లును; భూములపై పెట్టిన మొత్తములకు నూటికి రు 7ను లాభము వచ్చుచున్నది, రైళ్ళపై బెట్టు సొమ్ముపై లాభము విదేశీయులకును, భూములపై జేయు ఖర్చులపై లాభము మనకు చెందుతున్నది. భూములపై జేయు ఖర్చు హెచ్చుచేసిన అందుల ఫలసాయము హెచ్చు అగునని భూముల విషయమై తెలిసినవారు చెప్పుచున్నారు.

ఈ సందర్భమున మనమిచ్చు పన్నును పోల్చిన యీ పన్ను మన దేశమువంటి దేశములో ఎంత హెచ్చుగనున్నదో తెలియగలదు. బ్రిటిషువారు నూటికి 1_3, ఫ్రాన్సు నూటికి 4_7, జర్మనీ నూటికి 3_0 ఇండియా, నూటికి 15_0 చొ॥ న భూమి శిస్తు చెల్లించుచున్నారు. 30 సం॥ లకొకసారికి సెటిల్‌మెంటు అగుచున్నది. అనగా అప్పట్లో పన్నులు హెచ్చుగనున్నవి.

## ప్రత్యేకాంధ్ర రాష్ట్రము

విభజించి ప్రత్యేక రాష్ట్రముగ నేర్పరచినయెడల ఆంధ్ర రాష్ట్రమందు 11 జిల్లాలు ఉండును. వి స్తీర్ణము 80 వేల చదరపు మైళ్లు. జన సంఖ్య ఒక కోటి డెబ్బది లక్షలు. ల్యాండు రెవిన్యూ ఆదాయము మూడున్నర కోట్ల రూపాయలుండును. ఇదివరకు ప్రత్యేక రాష్ట్రముగానున్న బీహారు, ఒరిస్సా యొక్క ల్యాండు రెవిన్యూ ఒక కోటి పదమూడు లక్షలును ప్రత్యేక రాష్ట్రము కాగోరు సింధు రాష్ట్రము యొక్క ల్యాండు రెవిన్యూ 74 లక్షలును, ఉత్కళ రాష్ట్రము యొక్క ల్యాండు రెవిన్యూ 80 లక్షల లోపనను నుండును. జన సంఖ్య జూచినను ఇట్లే అగుపడుచున్నది. ఆంధ్ర రాష్ట్ర జన సంఖ్య సుమారు 1 కోటి 70 లక్షలుండును. ప్రస్తుతము దక్షిణ రాష్ట్రము కావలెనని కోరుచున్న ఉత్కళ రాష్ట్ర జన సంఖ్య ఒక కోటియు, సింధు రాష్ట్రము జన సంఖ్య 40 లక్షలుండును. కాన ప్రత్యేక రాష్ట్రముగా తక్షణమే యే యాక్షేపణయు లేకుండ ఏర్పాటు చేయదగిన ఆంధ్ర రాష్ట్రము వెనుకబెట్టుట అన్యాయము.

[1970, ఏప్రెల్ 10వ, తేదీ —శ్రీ జోగయ్య పంతులుగారి 101వ, జన్మదినోత్సవ సందర్భంగా]

---

## పరిపాలన విషయాలు

### డాక్టర్ల ప్రైవేటు ప్రాక్టీసుపై వున్న నిషేధం తొలగింపు

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రభుత్వ డాక్టర్లు ప్రైవేటుగా ప్రాక్టీసు చేయడంపైగల నిషేధాన్ని 1970 మే మొదటి నుంచి తొలగిస్తారు.

ప్రభుత్వ ఆసుపత్రులలోని పే క్లినిక్కుల పథకాన్నికూడా అదే తేదీనుంచి ఉపసంహరించుకొని, 1968 అక్టోబరు 31 వ తేదీనాటి పరిస్థితిని పునరుద్ధరిస్తారు.

ప్రైవేటు ప్రాక్టీసును నిషేధించడంవల్ల, పే క్లినిక్కుల పథకాన్ని నిర్వహించడంవల్ల ప్రభుత్వానికి యేటా సుమారు ఒక కోటి రూపాయల చొప్పున ఖర్చయింది. 1968 నవంబరునుంచి ప్రైవేటు ప్రాక్టీసును నిషేధించడం జరిగింది.

---

మీరు

# క్రొత్త 1969 నార్టన్

## సైకిలును చూచేరా

?




## అది చూచుటకు ఎంతో ముచ్చటవేస్తూ ఉంటుంది!

అవును! క్రొత్త నార్టన్‌కు ఆశ్చర్యకరమైన పరిక్రొత్త అంశములు ఉండుట వలన దానిని చూడగానే మీరు కొనాలనుకొంటారు. అది భారతదేశములో సైకిళ్లను తయారుచేయుటలో మార్గదర్శకులైన వారిచే భారతదేశములో తయారుచేయబడుతోంది!

**హింద్ సైకిల్స్ లిమిటెడ్,**
**250, వర్లి, బొంబాయి-25 డిడి.**
భారతదేశములో పూర్తి సైకిలును తయారుచేసే దాం పెద్ద సంస్థ. అన్ని విడి భాగములను ఒకే చోట తయారుచేస్తోంది.




3AS-HC 25 TEL

## ఏ విధముగా చూచినా ఎంతో మంచి సైకిలు-నార్టన్

## పండుగలూ పర్వదినాలూ

### కమలా త్రివేణి

### శంకర జయంతి

వైశాఖ శుక్ల పంచమి (ఈ సంవత్సరం మే 10వ తేదీని) శ్రీ శంకర భగవత్పాదుల జన్మదినం. కేరళరాష్ట్రంలోని పూర్ణా నదీ తీరంలో ఉన్న కాలాది గ్రామంలో శంకరుడు జన్మించాడు. ఏడు సంవత్సరాల వయస్సులోనే వేదవేదాంగాలు సంపూర్ణంగా అధ్యయనం చేశాడు. ఎనిమిదవయేటనే సన్యసించాడు. పదిహేనేళ్ల ప్రాయంలోనే బ్రహ్మసూత్రాలకు, ఉపనిషత్తులకూ, భగవద్గీతకు భాష్యాలు రచించాడు.

ఆయన జీవించినది కేవలం ముప్ఫయిరెండు సంవత్సరాలు. ఆయన జీవితంలోని రెండవభాగం పదహారేళ్లు రామేశ్వరం నుంచి కాశ్మీరం వరకు పర్యటనచేసి ఎందరెందరితోనో వాదంచేసి సనాతన ధర్మాన్ని పునరుద్ధరించాడు. పూరీ జగన్నాథంలో, ద్వారకలో, శృంగేరిలో, బదరిలో మఠాలు స్థాపించి అద్వైత ప్రచారం చేశాడు.

అద్వైత సారాన్ని శంకరుడు ఒక్క శ్లోకంలో చెప్పాడు.

కింజ్యోతి స్తవ భాను మా నహని మే రాత్రౌ ప్రదీపాదికం
స్యాదేవం రవిదీప దర్శన విధౌ కిం జ్యోతి రాఖ్యాహి మే
చక్షు స్తస్య నిమీలనాది సమయే కిం ధీర్ధియో దర్శనే
కిం తత్రాహమతో భవాన్పరగ కం జ్యోత్య స్మ్యహం హే ప్రభో

నీ జ్యోతిఏది ? పగటిపూట సూర్యుడు, రాత్రివేళ దీపాదులు. సూర్యకాంతిలో కాని దీపం వెలుగులో కాని దేని ద్వారా నువ్వు చూడగలుగుతున్నావు? కంటిద్వారా. కన్నులు మూసుకున్నప్పుడు నువ్వు ఎలా గ్రహింప గలుగుతున్నావు ? బుద్ధిద్వారా. బుద్ధిద్వారా గ్రహణం చేసేది ఎవరు ? నేనే. నేను పరంజ్యోతిని. నేను బ్రహ్మను.

బ్రహ్మయే సత్యం, కంటికి కనబడే జగత్తు మిథ్య, జీవుడే బ్రహ్మ. తాటిని చూచి పాము అనుకోవడం భ్రమ. జగత్తు సత్యం అనుకోవడం భ్రమ. ద్వైత భావానికి కారణం మాయ మాయ నశిస్తే ఇదంతా బ్రహ్మయే అని 'నేను బ్రహ్మను' అనే జ్ఞానం కలుగుతుంది.

అద్వైతభావం కుదరడానికి శంకరుడు సామాన్యులకు మొదటి సాధనగా భక్తి మార్గాన్ని ఉపదేశించాడు.

దిన మపి రజనీ సాయం ప్రాతః శిశిర వసంతౌ పునరాయాతః
కాలః క్రీడతి గచ్ఛత్యాయు స్తదపి న ముంచత్యాశావాయుః
భజ గోవిందం భజగోవిందం భజ గోవిందం మూఢమతే.

పగలూ, రాత్రీ, సాయంకాలమూ, ప్రాతఃకాలమూ శిశిరమూ వసంతమూమళ్లీ మళ్లీ వస్తూఉంటాయి. ఈవిధంగా కాలలీల జరుగుతూ ఉంటుంది. ఆయువు చెల్లిపోతుంది. ఆశావాయువు మాత్రం విడవదు. అందుచేత ఓ మూఢుడా ! నిరంతరమూ గోవిందుని భజించు.

### బుద్ధ జయంతి

వైశాఖ శుద్ధ పూర్ణిమ (ఈ సంవత్సరం మే 21 తేదీని) బుద్ధ జయంతి.

జగతులో ప్రత్యక్షంగా కనబడేది దుఃఖం. ప్రతిహతంగా కానవచ్చేది మృత్యువు. దుఃఖాన్ని నివారించడానికీ, మృత్యువును జయించడానికీ మానవజాతి చింతన చేసి సమకూర్చు కొన్నవే వివిధమతాలు. వివిధ మతకర్తలు వివిధ సిద్ధాంతాలను ప్రతిపాదించారు. వివిధ ఆచారాలను, కర్మకాండలను నియమించారు.

బుద్ధుడు ఏ సిద్ధాంతాన్ని ప్రచారం చేయలేదు. సృష్టి రహస్యం ఏమిటి? దేవుడు వున్నాడా? లేదా? ఈశ్వరుడు అంటే ఏమిటి? ఆత్మ అంటే ఏమిటి? ఇలాంటి సమస్యలను గురించి ఆలోచించి బుర్ర పాడు చేసుకోవద్దు అన్నాడు. ప్రపంచంలో దుఃఖంఉంది. దుఃఖానికి కారణం తృష్ణ. తృష్ణ అణిగితేదుఃఖం నశిస్తుంది దుఃఖం అంతమైతే అదే నిర్వాణం. నిర్వాణంపొందడానికి అష్టాంగమార్గం అనుసరించాలి. చెడ్డయోచనలు విడిచిపెట్టాలి. కరుణ, సేవ మొదలైన సద్భావాలను పెంపొందించుకోవాలి. ధ్యాన, మైత్రీ, కరుణా, ఉపేక్ష, ముదితాది సాధనాలను అభ్యసించాలి ఈ అభ్యాసంవల్ల ప్రజ్ఞ కలుగుతుంది. ప్రజ్ఞ యొక్క పరిపూర్ణతయే బోధి. అదే నిర్వాణం.

ఇవి గుడ్డిగా నమ్మవలసిన సూత్రాలుకాని సిద్ధాంతాలు కాని కావు. ఇతరులు చెప్పారని దేనినీ నమ్మవద్దని ఆయన బోధించాడు. సత్యం అనుభవైక వేద్యం. చర్చలవల్ల ఫలితం శూన్యం. ఆచరణ వల్లనే సత్ఫలితాలు కలుగుతాయి సిద్ధాంతాన్ని వల్లించడంవల్ల ప్రయోజనం లేదు, భూమికి ఆకర్షణశక్తి ఉంది అనీ మాటి మాటికీ నోటితో పలుకుతూ ఉంటే సరిపోదు. పై నుంచి కిందికి పడుతున్న రాతిని చూచి భూమ్యాకర్షణశక్తిని మనసా అనుభూతం చేసుకోవడమే సిద్ధి.

బౌద్ధం కర్మకాండల మతంకాదు. అది శీలానికి ప్రాముఖ్యం ఇచ్చే జీవన విధానం, శరీరాన్ని శోషింపజేసే కఠినచర్యలు ఏ విధంగా అవాంఛనీయాలో విశృంఖలమైన ఇంద్రియ వ్యాపారం కూడా ఆవిధంగానే అవాంఛనీయం అని బుద్ధుని ఉపదేశం.

బుద్ధుడు జన్మించినది వైశాఖ పూర్ణిమనాడు. ఆయనకు సమ్యక్సంబోధి కలిగినది ఆ తిథినాడే. ఆయన మహాపరి నిర్వాణం చెందినదికూడా వైశాఖ పూర్ణిమనాడే. వైశాఖపూర్ణిమ మూడు విధాల పవిత్రమైన పర్వదినం. ×

# విశాఖపట్టణంలో







(ఎడమవైపు పైన,
నిర్మాణంలోవు
(క్రిందిభాగంలో)
ఓడమీద పొవ
(కుడివైపు పైన)
జలప్రవేశోత్స
(ఎడమవైపు క్రింద
నిర్మాణం పూ
ప్రయాణం.

# నౌకా నిర్మాణ సంస్థ



దేశంలో వున్న ఒకే ఒక నౌకా నిర్మాణశాల–హిందూస్థాన్ షిప్ యార్డ్–మన రాష్ట్రంలో వుండడం మనకు గర్వకారణం. ప్రతియేడూ యీ నౌకా నిర్మాణశాలలో అంతర్జాతీయ ప్రమాణాల ననుసరించి నిర్మించిన నౌకలు అనేకం తయారవుతూ వున్నాయి

మన దేశానికి సుమారు 5,700 కి. మీ తీర ప్రాంతం వుంది. సముద్రయాన విషయాలలో భారత దేశానికి వైభవోపేతమైన పురాతన చరిత్ర వున్నది. ఋగ్వేద కాలంనుండి, తూర్పు ఇండియా కంపెనీ కాలంవరకు, అనేక శతాబ్దాలుగా భారత దేశం ప్రపంచ సముద్ర యాన దేశాలలో అగ్రశ్రేణిలో వున్నదనే విషయానికి చారిత్రక ఆధారాలు కొల్లలుగా వున్నాయి

డిజైనులో, పనితనంలో, నిర్వహణలో మన నౌకా నిర్మాణ పరిశ్రమ అత్యుత్తమ ప్రమాణాలతో ప్రఖ్యాతి గాంచింది 18 వ శతాబ్దంలో కూడా, బ్రిటిష్ పరిపాలన రోజుల్లో భారత దేశంలో నిర్మించిన నౌకలు బ్రిటిష్ నౌకాదళంలో వుండేవి. మన రాష్ట్రంలో, విశాఖపట్టణంలో వున్న హిందూస్థాన్ షిప్ యార్డ్ దేశ పురోగమన చరిత్రలో నూతనాధ్యాయాన్ని సృష్టించింది



న్రి)
ఓడ దృశ్యం

అమరుస్తున్న దృశ్యం

జరిగిన తరువాత

ంయిన ఓడ వ్రిభమ





# బ్యాంకుల జాతీయకరణ - ఆర్థిక ప్రగతి

—కోటంరాజు రామకృష్ణశర్మ

ఏదైనా భారీ పరిశ్రమ, మధ్య తరహా పరిశ్రమ లేక చిన్న తరహా పరిశ్రమ నెలకొల్పబడి సమర్థవంతముగా, లాభవంతముగా నిర్వహింపబడాలంటే విద్యుత్ సరఫరా, నీటి సరఫరా ముడి సరుకు ఆవశ్యకత ఎంతో ఋణ సౌకర్యము కూడా ఆ పరిశ్రమకు అంత అవసరము. అందువలననే ఋణ సౌకర్యము వాణిజ్య పారిశ్రామిక అభివృద్ధికి జీవనాడిగా పరిగణించబడుచున్నది.

ఆర్థికాభివృద్ధి నొందుచున్న మన భారతదేశంలో, ఋణ వసతి గలిగించే ప్రత్యేక సంస్థలు తగినన్ని లేని కారణమువలన మన దేశపు ఆర్థిక వ్యవస్థలో బ్యాంకుల పాత్ర చాలా విశిష్టమైనదని ప్రత్యేకముగా చెప్పనవసరములేదు. కేంద్ర ప్రభుత్వమువారు జులై 19 వ తేదీన, దేశంలోని రూ 50 కోట్లు డిపాజిట్లు మించిన 14 వాణిజ్య బ్యాంకులను జాతీయము చేయుటచే, దేశపు బ్యాంకింగు వ్యవస్థలో ఒక నూతనాధ్యాయము ప్రారంభమైనదని చెప్పవచ్చును. బ్యాంకు జాతీయకరణ విషయాన్ని కూలంకషంగా ఈ క్రింది రీతిన చర్చించుకొందాము.

## చిన్నతరహా పరిశ్రమ–బ్యాంకుల జాతీయకరణ

చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధి మనదేశపు పారిశ్రామిక ఆర్థికాభివృద్ధిలో అంతర్భాగమై అత్యంత అగ్రస్థానము వహించినది. చిన్న తరహా పరిశ్రమలను అధిక సంఖ్యలో నెలకొల్పుట వల్ల నిరుద్యోగ సమస్య పరిష్కరింపబడుటయే కాకుండా ఉత్పత్తి పెరుగగలదు ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని ఎంత వరకు ఈ చిన్న తరహా పరిశ్రమ రంగము బ్యాంకుల జాతీయకరణకు పూర్వం ఋణ సహాయాన్ని బ్యాంకుల ద్వారా పొందినది అన్న విషయము ముఖ్యం. ప్రైవేటు యాజమాన్యంలో నున్న బ్యాంకులు సాధారణంగా పరిశ్రమలకు ఋణవసతి గలుగజేయునపుడు, ఆ యా పరిశ్రమలు హామీగా ఇచ్చే ఆస్తులను, వాటి ఆర్థిక సోమతను దృష్టియందుంచుకొని ఋణ వసతి గలుగజేసెడివి. దానికి విరుద్ధంగా విలువగల ఆస్తులను హామీగా ఇవ్వలేని చిన్న తరహా పరిశ్రమలకు, సన్నకారు వ్యాపారస్తులకు (Retail Traders) బ్యాంకులనుండి ఋణసహాయము తగిన మేరకు లభించెడిదిగాదు, అందువల్ల చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి మన ఆర్థిక వ్యవస్థలో చాలా వెనుక బడిపోయినది. స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియావారు జరిపిన ఒక సర్వేవల్ల అధిక సంఖ్యాకమైన చిన్న తరహా పరిశ్రమలకు బ్యాంకుల నుండి ఋణ వసతి కలుగలేదని తెలియుచున్నది. 1967–68 సంవత్సరము దేశంలో 1·2 లక్షల రిజిష్టరు చేయబడిన చిన్నతరహా పరిశ్రమలు గలవు. నాల్గవ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఈ చిన్నతరహా పరిశ్రమ రంగానికి రూ. 500 కోట్లు ఋణసహాయము కావలయునని అంచనా వేయబడినది. బ్యాంకుల జాతీయకరణతో తగిన మేరకు ప్రణాళికా బద్ధకంగా ఆర్థికవనరులు లభించగలవని ఆశిద్దాం.

## వ్యవసాయరంగము - బ్యాంకుల జాతీయకరణ

మనదేశపు జనాభాలో 70 శాతము వ్యవసాయరంగములో ఆధారపడివుండుటచే మన ఆర్థిక వ్యవస్థలో ఈ రంగానికి వున్న ప్రాముఖ్యాన్ని గూర్చి వేరుగా చెప్పనవసరము లేదు. అటువంటి ఈ వ్యవసాయరంగానికి ఋణసౌకర్యము తగిన మేరకు లేనందున, ఆధునాతనంగా చాలా వెనుకబడివున్నది. Agricultural finance Corporation. State Bank of India సహకార సంస్థలు ఈ రంగానికి ఋణవసతి కలుగచేయటానికి నిర్దేశింపబడి నప్పటికీ, అవి ఊహించినంతగా ఆశయాన్ని సాధించలేక పోయినవి. అందుకు కారణాలు అనేకము. సహకార సంస్థలు రైతులకు ఇచ్చు ఋణాలలో 25 శాతం తిరిగి వసూలు చేయలేనందున వచ్చు నష్టాన్ని Reserve Bank of India భర్తీ చేయవలసి వచ్చుచున్నది. చెప్పవచ్చిందేమంటే రైతులు ఋణముపుచ్చుకొన్న తర్వాత ఆ డబ్బును ఆశించిన విధంగా ఖర్చుపెట్టక, సాంఘిక కార్యకలాపాదులకు పెట్టుచున్నారు. వ్యవసాయ రంగము వర్షాధారం కావటంచేత అతివృష్టి, లేక అనావృష్టి రోజుల్లో రైతులు తాము అప్పుగా పుచ్చుకొన్న ధనాన్ని, ఉత్పాదక ప్రయోజనానికి (Production Purpose) వినియోగించకుండా కేవలం పొట్టపోసుకోవడానికి వినియోగిస్తారు. మూడవ కారణం– చాలా వరకు ఈ సహకార సంస్థల నిర్వహణ రాజకీయ ఒత్తిడులకు లోబడి వుండుటచేత, ఆశించిన విధంగా వ్యవసాయరంగానికి కావలసిన ఆర్థిక వనరులను సమకూర్చలేక పోతుంది. దీన్ని గుణపాఠంగా పెట్టుకొని, జాతీయము చేయబడిన బ్యాంకులు, రాజకీయ ఒత్తిడులకు లోనుగాకుండా, ఒక సక్రమమైన, ఆదర్శమైన మార్గంలో వ్యవహరించినట్లయితే, వ్యవసాయరంగం మన దేశపు ఆర్థిక వ్యవస్థలో ముందంజ వేయగలదు.

నాల్గవ పంచవర్ష ప్రణాళికా కాలములో, అధిక సంఖ్యలో బ్యాంకులను గ్రామీణ ప్రాంతాలలో స్థాపించాలని, తద్వారా గ్రామీణ

ప్రాంతాల నుండి ఆర్థిక వనరులను సేకరించి, దేశ ఆర్థిక ప్రగతికి మళ్ళించాలని ప్రభుత్వమువారి ఆశయము. ఈ ఆశయమువెనుక ఆర్థికశాస్త్ర సూత్రాలు చాలా గలవు. మన దేశపు ప్రణాళికాబద్ధమైన ఆర్థికాభివృద్ధి (Planned Economic Development) కొరకు గ్రామీణ ప్రాంతాల నుండి వసూలుచేసే తలసరి పన్ను (Per capita taxation) రూ. 18 లు కాగా పట్టణ ప్రాంతాల నుండి వసూలుచేయు తలసరి పన్ను రూ. 200 కలదు. దీనినిబట్టి దేశ ఆర్థికాభివృద్ధిలో పట్టణవాసులు అధిక భారం భరిస్తున్నారని తెలియగలదు. మన దేశం వ్యవసాయదేశం అగుటవల్ల ఆర్థికాభివృద్ధి పొందాలంటే గ్రామాలు తద్వారా వ్యవసాయము (పద్ధతులు) అభివృద్ధి పొందాలి. బ్యాంకింగు విధానము గ్రామాల్లోకి వ్యాపిస్తే, దేశ ఆర్థిక ప్రగతికి, ఆ ప్రాంతాలనుండి కూడా ఆర్థిక వనరులు తరలించబడ గలవు. అట్టి ఆర్థిక వనరులను ప్రణాళికాబద్ధంగా తరలించ వచ్చును. ప్రస్తుతము బ్యాంకింగ్ విధానము లేని గ్రామాలు, చిన్న పట్టణాలు కోకొల్లలు. కేవలం లాభాన్నే దృష్టిలో పెట్టుకొని ఇంత కాలంగా బ్యాంకింగు వ్యాపారాన్ని హస్తగతం చేసుకొన్న ప్రైవేటు రంగమే దీనికి కారణం అని చెప్పవచ్చు. బ్యాంకింగు కార్యకలాపాలు బొంబాయి, కలకత్తా, మద్రాసు వంటి నగరాల్లో కేంద్రీకృతమైనాయి అంటే కొంతవరకు బ్రిటిషువారు అనుసరించిన (Laissez Faire) విధానమే. ప్రజల ఆర్థిక నిత్య జీవితంలో జోక్యం కలిగించుకోకుండా ఉండుట కారణమని చెప్పవచ్చును. అట్టి వ్యవస్థ యొక్క వికేంద్రీకరణయే ప్రభుత్వంవారి జాతీయకరణోద్దేశ్యము.

## మరికొన్ని లాభములు

జాతీయకరణ ఫలితంగా ఋణ వసతికి, పూర్వపు ప్రాతిపదిక (ఆస్తుల హామీ ప్రాతి పదిక) మీద కాకుండా ఋణము తీసుకొనేవారి ఉత్పాదక ప్రయోజనాన్ని (Productive purpose) ప్రాతిపదికగా, తీసుకొని, బ్యాంకులు వ్యవహరించినట్లయితే దేశంలో నిరుద్యోగ సమస్యను తగ్గించుటయే కాకుండా, ఉత్పత్తిని పెంచగలము. ప్రైవేటు బ్యాంకుల మధ్య వుండెడి పోటీ (Competition) ప్రభుత్వ రంగంలోని బ్యాంకుల మధ్య వుండదు. కనుక అవి లాభసాటిగా నిర్వహింపబడి, వాటి సేవా ధరము (Cost of service) తగ్గించుకొనగలవు. (పోటీలేని వ్యవస్థలో అసమర్థత (in efficiency) వుండుటకు అవకాశం వున్నది కనుక ప్రభుత్వము వారు అట్టి అసమర్థతకు తావు ఇవ్వకుండ చూడవలయును. వృత్తి విద్య అభ్యసించిన నిరుద్యోగులకు కూడా బ్యాంకుల జాతీయకరణ వల్ల ఆర్థిక సహాయం లభించగలదు.

## కొన్ని సూచనలు

ప్రాంతీయ ఆర్థిక సమానత్వం అనేది మన ప్రణాళికా సూత్రాలలో ముఖ్యమైన విషయం. గత 16 సంవత్సరాలుగా దేశము ఆర్థికంగా అభివృద్ధి చెందినప్పటికీ, కొన్ని ప్రాంతాలు ఆర్థికంగా అభివృద్ధినొందుట, మరికొన్ని ఆర్థికంగా వెనుకబడి యుండుట చాలా శోచనీయము. ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతాలలో చురుకుగా అభివృద్ధి పొందటానికి, తద్వారా ఆర్థిక ప్రాంతీయ సమానత్వం సాధించటానికి, ఏ దేశంలోనైనా బ్యాంకింగ్ విధానం చాలా శక్తివంతమైన ఆయుధం. అట్టి ఆయుధాన్ని మన ప్రభుత్వం వారు సద్వినియోగపరచినచో త్వరితగతిన ఆర్థిక ప్రగతికి దోహదమొనర్చగలదు.

ఈ ఆశయ సాధనకు మన దేశములోని బ్యాంకింగు వ్యవస్థను పునఃవ్యవస్థీకరించవలసిన అవసరం ఎంతైనా గలదు. జాతీయ ఋణ సంస్థ (National Credit Council) వారి సలహాననుసరించి ప్రాంతాల ఆర్థిక పరిస్థితులను ప్రాతిపదికగా తీసుకొని, ఆయా ప్రాంతాలనుండి వచ్చే డిపాజిట్లను, ఆయా ప్రాంతాల ఋణావసరాలను దృష్టియందుంచుకొని, పునవ్యవస్థీకరించినచో ప్రాంతీయ ఆర్థిక సమానత్వం సాధించగలము. నేటి జాతీయకరణముగావించిన బ్యాంకింగు వ్యవస్థయొక్క సామర్థ్యాన్ని తెలుసుకోటానికి లోగడవలె లాభాలు కొలబద్దలు కానేరవు. ప్రైవేటు రంగంలోని బ్యాంకుల సామర్థ్యానికి అవి ఎంతవరకు వాటి ఆర్థిక ఆశయాలను సాధించినవో, ఎంతవరకు ఆర్థిక వనరను గ్రామీణ ప్రాంతాలనుండి సేకరించి, దేశాభ్యుదయానికి దోహదమొనర్చినవో అనే కొలబద్దలతో కొలత కొలవ వలసియున్నది.

బ్యాంకుల జాతీయకరణవలన దేశపు ఆర్థిక వ్యవస్థ ప్రగతి పథంలో ఆదర్శ తారగా ప్రకాశింపగలదని ఆశిద్దాం.

## భారత సైనిక పరిషత్తు పరీక్షలు

డెహ్రాడూన్‌లోని భారత సైనిక పరిషత్తులో 1971 జూన్ నెలలో ప్రారంభమయ్యే 51వ తరగతులలో అభ్యర్థులను చేర్చుకొనే నిమిత్తం, యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్‌వారు, ఎన్నిక చేసినకేంద్రాలలో, 1970 నవంబరు 10,11 తేదీలలో పరీక్షలు నిర్వహిస్తారు. ఇంటర్ మీడియట్ కానీ అందుకు సమానమైన పరీక్షలోకానీ ఉత్తీర్ణులైనవారు ఈ పరీక్షకు హాజరగుటకు అర్హులు. కానీ 1971 జూలై 1 వ తేదీనాటికి వారు 19_21 సంవత్సరాల మధ్యవయస్కులై ఉండాలి. భారతదేశంలో నివసిస్తూన్న అభ్యర్థులు తమ దరఖాస్తులను 1970 జూన్ 15వ తేదీనాటికి అందునట్లుగానూ, విదేశాలలోనూ, అండమాన్, నికోబార్, లక్కదీవ్, మనికోయ్, అమినీ దీవులలో నివసించే అభ్యర్థులు తమ దరఖాస్తులను 1970 జూన్ 29వ తేదీలోగా అందునట్లుగానూ యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ వారికి పంపుకోవాలి.


చెరకు సముద్రం
ఎచ్చట ఉందో
చూశారా ?
ఫాంటా ఆరంజి
రుచినేమందును?
మరిమరీ దాహం
కావాలని పించును!
ఫాంటా కోకా-కోలా కంపెనివారి ఉత్పత్తి
Fanta is a Registered Trade Mark of the Coca Cola Company

# మహాభారతము

తాపెగంటుల లక్ష్మీశాస్త్రి

"ఏష్టవ్యా బహవః పుత్రాః యద్యేకోఽపి గయాం వ్రజేత్।
యజేత వాఽశ్వమేధేన నీలంవా వృషముత్సృజేత్॥"

అనగా, అనేక పుత్రులు కలుగవలెనని కోరవలెను. 'వారిలో నొకడైనను గయకు పోవునోలేక అశ్వమేధయజ్ఞమును చేయునో లేక నీలమగు ఆబోతును విడుచునో (నీల వృషోత్సర్గము') యని యనుకొనెదరు. ఎందుకనగా అట్టి పుత్రుని వలన తనకు పూర్వము తన తరువాత రానున్న పది తరముల సంతతికి పుణ్యలోకములను కలిగించును, (నీల వృషభ లక్షణమేమనగా, శరీరము ఎఱ్ఱగా నుండి, తోక కొన తెల్లగా నుండి, గిట్టలు, కొమ్ములుగూడ తెల్లగా నున్న యెద్దు 'నీల వృషభమనబడును) అచటనే, ఎప్పుడు గూడ నశించని శాఖలు—వేళ్లుగల 'అక్షయవట' వృక్షము, మహానది, 'గయశీర్ష'మను తీర్థము గూడ నున్నవి. అస్థలమునందు పితృదేవతలకు ఇచ్చిన అన్నము అక్షయము (తరగనిది) అగును. అచటనే పవిత్రజలము గల 'ఫల్గు' అను మహానది, బహుఫల వృక్షములుగల 'కౌశికీ' నద్దియునున్నవి. అచ్చోటికి విశ్వామిత్రుడు పోయి సేవించి బ్రాహ్మణత్వమును బడసెను.

"తూర్పు దిక్కునందే పవిత్ర గంగానది ప్రవహించుచుండును. దాని తీరమునందు పూర్వము భగీరథుడు అనేక యజ్ఞములను చేసెను. 'పంచాల' దేశములందు 'ఉత్పలా' వనము కలదు. అందు పూర్వము విశ్వామిత్రుడు పుత్రునితోసహా యజ్ఞము చేసెను. అచట విశ్వామిత్రుని వైభవమును చూచి పరశురాముడు అతని వంశ వర్ణనము చేసెను. 'కాన్యకుబ్జ' దేశములో విశ్వామిత్రుడు ఇంద్రునితోగలిసి సోమపానము చేసెను. తరువాత అతడు క్షత్రియత్వమునువీడి పైకిలేచి 'నేను బ్రాహ్మణుడను' అని ప్రకటించెను. పవిత్రమగు ప్రయాగ క్షేత్రమునందు అగస్త్యాశ్రమము గలదు. అచటనే అగస్త్య పర్వతము అతి రమణీయముగ నున్నది. అచటనేఉన్న 'భాగీరథీ సరస్సు'నకు 'బ్రహ్మశాలా' అని ప్రసిద్ధి కలదు. మతంగ మహామునియొక్క 'కేదారాశ్రమము' అక్కడ నున్నది. అచటనే 'కుండోదము'అను ఫలమూల జల సమృద్ధిగల పర్వతము ఉన్నది. అక్కడ పూర్వము అరణ్యవాసముచేత అలసిన నలమహారాజు జలపానముచే అలసట తీర్చుకొనెను. రాజా! పూర్వ దిశయందలి అనేక పుణ్యతీర్థ విశేషములను గూర్చి చెప్పితిని. ఇక ఇతర దిక్కులందలి తీర్థములను గూర్చి వినుము:—

"రాజా! దక్షిణ దిక్కునందు 'గోదావరీ' నది ఉన్నది. దానిని అనేక తాపసోత్తములు సేవించెదరు. వేణా—భీమరథీ నదులు ఉన్నవి. 'నృగ' మహారాజుయొక్క 'పయోష్ణి' నది ఉన్నది. ఆ నదీ తీరమునందు మార్కండేయ మహాముని నృగ మహారాజుయొక్క వంశ చరిత్రను వర్ణించెను. ఆ నదీ జలము అతి పవిత్రము. దాని తీరమునందు 'శృంగము' అను పేరుగల శంకరుని వాద్యము గలదు. అది స్వర్గముకన్న ఎత్తుగా నున్నది. దానిని దర్శించిన నరుడు శివసాయుజ్యమును పొందును. ఆ నది గంగాది నదులకన్నను పవిత్రమైనది. ఆ దిక్కునందే 'మాఠర' వనము కలదు. అచటనున్న 'వరుణస్రోతస' పర్వతమునందు మాఠర (ఈ దేవత సూర్యుని ప్రక్కన నున్నది) దేవతయొక్క విజయ స్తంభము నాటబడి యున్నది. ఈ స్తంభము 'త్రివేణీ' నదికి ఉత్తరముగానున్న మార్గమునందలి కణ్వాశ్రమముననున్నది. 'శూర్పారక' క్షేత్రమునందు పరశురాముని వేది ఉన్నది. దానియందు 'పాషాణతీర్థ—పునశ్చంద్రా' తీర్థములు ఉన్నవి. దక్షిణ దిక్కునందే 'అశోక-అగస్త్య-వారుణ-కన్యాకుమారీ' తీర్థములు వెలసియున్నవి. ఇవన్నియు పాండ్య దేశములోనివి. అచటనే 'తామ్ర-పర్ణీ' నది ఉన్నది. 'గోకర్ణ-(అగస్త్య శిష్యుని) పుణ్యాశ్రమ-దేవసమగిరి-వైదూర్యపర్వత-అగస్త్యాశ్రమాది' పుణ్య క్షేత్రములు కలవు సౌరాష్ట్ర దేశమునందు అనేక పుణ్య క్షేత్రములు-తీర్థములు కలవు. అచటి 'ఉజ్జయంత' పర్వత సమీపమునందు 'ద్వారవతీ' (ద్వారకా) పురము కలదు అది భగవంతుడగు శ్రీకృష్ణునకు నివాస స్థానము అతడే పరమాత్ముడు, సనాతన ధర్మ స్వరూపుడు. ఆ దేవదేవుడు, పవిత్రులలోనెల్ల పవిత్రుడు, పుణ్యులలోనెల్ల పుణ్యుడు, మంగళములలోనెల్ల మంగళకరుడు, త్రైలోక్య పావనుడు, సనాతనుడు అవ్యయుడు (నాశరహితుడు), వ్యయాత్ముడు, క్షేత్రజ్ఞుడు, పరమేశ్వరుడు. అట్టి మధుసూదనుడు ద్వారకలో వసించి యుండును" అని చెప్పి ధౌమ్యాచార్యులు ధర్మరాజునకు పశ్చిమ దిక్కునందలి తీర్థములను గూర్చి యిట్లు చెప్పెను:—

"ధర్మజా! పడమటి దిక్కునందు పవిత్రమగు 'నర్మదా' నది ఉన్నది. మూడు లోకములలోని దేవ, ఋషి, మానవ సంఘములు నర్మదానదీ పవిత్ర జలములందు స్నానము చేయుటకు పోయెదరు. దాని తీరమునందు 'విశ్రవస' ముని యాశ్రమము ఉన్నది. అక్కడ కుబేరుడు పుట్టెను. ఆ దిక్కునందేయున్న వైదూర్య పర్వత శిఖరమునందు పుణ్యమగు నొక సరస్సు ఉన్నది. దానిని సేవించుటకు దేవగంధర్వులు వచ్చుచుందురు. ఆ దిక్కునందే విశ్వామిత్రుని తపఃప్రభావముచేత కల్పింపబడిన ఒక పవిత్ర నది ఉన్నది. ఆ నది ఒడ్డుననే నహుషుని కొడుకగు యయాతి స్వర్గమునుండి సత్పురుషులమధ్య పడెను. అచటనుండి ధర్మమయమగు లోకమునకు పోయెను. అచటనే పుణ్య సరోవరము, మైనాక పర్వతము, కక్షసేనుని ఆశ్రమము, చ్యవనాశ్రమము, కేతుమాలా–మేధ్యా–గంగానదులు, సైంధవారణ్యము, పుష్కర సరస్సు, మున్యాశ్రమములు మహాపుణ్య ప్రదములు ఉన్నవి. పుష్కర క్షేత్రము నామస్మరణముచేతనే సమస్త పాపములు నశించి సద్గతి కలుగును" అని చెప్పి ధౌమ్యాచార్యులు తరువాత ధర్మరాజునకు ఉత్తర దిక్కునందలి పుణ్యక్షేత్రములను గూర్చి యిట్లు చెప్పెను :–

"రాజా! నీకు పుణ్యతీర్థముల కథలను వినుటలో మిగుల శ్రద్ధ యున్నది. వినుము. వినుట వలన గూడ నీ శ్రద్ధ అధికమగును. రాజా! ఉత్తర దిక్కులో అతి పుణ్య నదులు 'సరస్వతీ–యమునా–ప్లక్షావతరణ–అగ్ని సరస్సు' అను తీర్థ ప్రదేశములు గలవు. అగ్ని శిరస్తీర్థమునందు పూర్వము సహదేవుడు 'శమ్యాక్షేప' (ఒక దండమును బలవంతుడు విసరి వేయగా అది యెంత దూరమువరకుపోయి పడునో ఆ దూర ప్రదేశము శమ్యాక్షేపమున బడును) దూరమువరకు మంటపము నిర్మించి అందులో యజ్ఞములు చేసెను. ఈ విషయములోనే 'ఇంద్రగీత' యను నొక గాధ కలదు. సహదేవుడు (ఇతడు సృంజయుని పుత్రుడు) ఈ మంటపములో ఒక లక్ష బంగారు నాణెములను దక్షిణగా యమునా తీరమునందు యజ్ఞములుచేసి అగ్ని దేవుని సేవించెను. అచటనే 'భరత చక్రవర్తి' ముప్పదియైదు అశ్వమేధయాగములను చేసెను. అతడు యజ్ఞములలో బ్రాహ్మణులకు ఇచ్ఛాపూర్తి చేసెను. ఉత్తర దిక్కులోనే 'శరభంగ' మహాముని యాశ్రమము కలదు. ఈ సరస్వతీ నది అతి పుణ్యప్రదమైనది కనుక పూర్వము ఈ నదీ తీరములో వాలఖిల్యాది మునులు గూడ యజ్ఞములు చేసిరి.

"ఈ దిక్కునందే 'దృషద్వతీ' నది యున్నది. దాని తీరమునందు 'న్యగ్రోధ–పుణ్య–పాంచాల్య–దాల్భ్యఘోష–దాల్భ్య' నామకములగు అయిదు ఆశ్రమములు గలవు. అచటనే అమిత తేజస్వియగు 'సువ్రతుడు' అను మహాత్ముని పుణ్యాశ్రమము కలదు. ఆ ముని భూలోక నివాసియైకూడ మూడు లోకములలో మిగుల ప్రఖ్యాతిని గడించెను. ఈ దిక్కునందే 'పీతావర్ణ–అవర్ణ' నామములతో 'నర–నారాయణ' మునులు ఉండిరి. ('పీతావర్ణ' అనగా నల్ల రంగు–అది గలవాడు 'నరుడు' అనగా అర్జునుడు ఆకారముగలవాడని అర్థము. 'అవర్ణ' అనగా ఏ రంగు గూడ లేనివాడు నిరాకారుడు–భగవంతుడు–నారాయణుడు అని అర్థము.) ఆ యిరువురు పురాణ మునులు అనేక యాగములచట చేసిరి. పూర్వము ఇంద్రాది దేవతలు 'విశాఖయూప' తీర్థమునందు విశేషముగా తపస్సు చేసియుండిరి గనుక ఆ తీర్థము మహాపుణ్య ప్రసిద్ధమైనది. 'జమదగ్ని' మహాముని 'పలాసవన'మునందు యాగములు చేసెను. ఆ యజ్ఞములందు సమస్త పుణ్య నదులు స్వయముగా తమ తమ పవిత్ర జలములను తెచ్చి యిచ్చి జమదగ్నిని సేవించినవి. ఆ మహాత్ముని యజ్ఞదీక్షకు విస్మయమంది గంధర్వరాజగు 'విశ్వావసువు' ఈ విధముగా కీర్తించెను :– 'జమదగ్ని మహాముని యజమానుడుగానుండి అనేక యజ్ఞములద్వారా దేవతలను తృప్తిపరచెను. ఆ యజ్ఞములలో పుణ్యనదులన్ని స్వయముగా వచ్చి మధువు (తేనె) చేత బ్రాహ్మణులను తృప్తిపరచెను.'

"యుధిష్ఠిర మహారాజా! కిన్నరులకు నివాస స్థానమగు హిమాలయ పర్వతమును పుణ్యనదియగు గంగ భేదించెను. ఆచోటికి 'గంగాద్వారము' (హరిద్వారము) అనిపేరు. ఆ పుణ్య తీర్థమును బ్రహ్మర్షులు సర్వదా సేవించుచుందురు. ఆ హరిద్వారమునందున్న 'కనఖల' తీర్థమును తొలుత బ్రహ్మర్షియగు 'సనత్కుమారుడు' సేవించెను. అచటనే 'పురు' అను పర్వతరాజ్యముకలదు. దానిని పూర్వము 'పురూరవసుడు' సేవించెను. 'భృగు' మహర్షి తపస్సుచేసినచోటు 'భృగుతుంగము' అనబడును. ఆ యాశ్రమము అత్యంత పుణ్యప్రదము. త్రికాల స్వరూపుడు, సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపి, సనాతన పురుషోత్తముడగు శ్రీమన్నారాయణుడు నివసించిన 'విశాలా' నగరము 'బదరీ' వన సమీపమునందు యున్నది. అది 'నర నారాయణుల' ఆశ్రమమగును. దానినే 'బదరికాశ్రమము' అనెదరు. అది త్రిలోక ప్రసిద్ధము. రాజా! 'ఆ విశాలా–బదరీ' వనముల సమీపమునందు గంగానది ఒకచోట వేడిగాను, మరియొకచోట చల్లగాను జలముగలిగి ప్రవహించుచుండెను. దాని యిసుక సువర్ణ వర్ణముగలదై యుండెను. అచటనున్న నారాయణ దేవుడు ఋషులు, దేవతలు, యోగులు ప్రతిదినము వచ్చి సేవించుచుండిరి. పరమాత్ముడు, సనాతనుడు నగు శ్రీమన్నారాయణుడు ఉన్నచోటనే, సమస్త తీర్థములు, దేవ మందిరములు, ఆశ్రమములు, సమస్తజగత్తు సన్నిహితములై యుండునుగదా!

"రాజా! ఆ బదరికాశ్రమమే పుణ్యక్షేత్రము, పరబ్రహ్మ స్వరూపము నగును. అది యే తీర్థము, తపో వనము. ఆ దేవుడే సమస్త దేవతలకు, భూతములకు పరమేశ్వరుడు, ఆ స్థలమే పరంధామము. మోక్ష స్వరూపము. దానిని తెలిసికొనిన తరువాత తత్త్వజ్ఞుడైన విద్వాంసుడు, జ్ఞాని యెప్పుడుగూడ శోక మోహములను పొందడు. అచటనే సమస్త బ్రహ్మర్షి–దేవర్షి–రాజర్షులు, మహాత్ములు, సిద్ధులు తపోధనులు నివసించుచుండెదరు. ఆది దేవుడగు నారాయణుడు నివసించుచుండు పుణ్య స్థలములలో నెల్ల అతి పుణ్యముకదా! ఇందులో సంశయములేదు.

"రాజా! పృథివిలోనున్న తీర్థములను, మందిరములను, పుణ్య క్షేత్రములను, పుణ్యాశ్రమములను గూర్చి నీకు తెలిపితిని. ఈ స్థలములను, వసువులు, సిద్ధ–సాధ్యులు, ఆదిత్యులు దేవ

తుల్యులగు ఋషులు, మహాత్ములు సేవించెదరు. మహారాజా! నీవుగూడ బ్రాహ్మణులతోను, సోదరులతోను ఈ తీర్థ యాత్రలు చేసినచో అర్జునుని వియోగమువలన నీకు గలిగిన బాధనుండి, ప్రాపంచిక సుఖ-దుఃఖ బాధలనుండి కూడ విముక్తిని పొంది శాశ్వత సుఖము అనుభవించెదవు" అని ధౌమ్యాచార్యులు చెప్పెను.

## ధర్మజుని కడకు లోమశుడు వచ్చుట

ధౌమ్యాచార్యులు ధర్మజాదులతో మాట్లాడుచుండగనే అక్కడికి బ్రహ్మర్షి సత్తముడైన 'లోమశుడు' వచ్చెను. యుధిష్ఠిరుడు ఆ మహామునిని ఎదుర్కొని స్వాగత సత్కారములుచేసి అర్ఘ్య పాద్యాదులతో పూజించి సుఖాసీనునిచేసెను. ఆ మహాముని యచటికి వచ్చిన కారణమును ధర్మజుడు సవినయముగా నడిగెను. ఆ మాటకు అమ్ముని యిట్లు చెప్పెను:—

"రాజా! సమస్త లోకములను సంచరించుచు నేను ఇంద్ర లోకమునకు పోయినప్పుడు ఇంద్రుని అర్ధాసనమునందు కూర్చొని యున్న అర్జునుని చూచితిని. అతడు సుఖముగాను క్షేమముగాను నున్నాడు. అర్జునుడు శివుని గూర్చి తపస్సుచేసి, శివునకు, అమృతమునుండి పుట్టి లభించిన "బ్రహ్మశిరస్సు" అను 'పాశుపతాస్త్రమును" ఆ మహాదేవుని నుండి సంపాదించెను. దాని ప్రయోగోపసంహారములనుగూడ సమంత్రకముగా నేర్చెను. దానితోపాటు అర్జునుడు ఆ మహాదేవునినుండి 'దండము' మొదలగు ఇతరాయుధములనుగూడ బడసెను. ఇంతియే కాక, అతడు ఇంద్రాగ్ని యమవరుణుల నుండికూడ దివ్యాస్త్రములనేకములు సంపాదించెను. విశ్వావసుపుత్రుడగు చిత్రసేనుని నుండి గాంధర్వ విద్యను, నృత్య, గీత, వాద్యాదులను నేర్చెను. దేవేంద్రుడు నా ద్వారా మీకు పంపిన సందేశమును గూడ వినుడు" అని లోమశుడు ఇంద్రుని సందేశము నిట్లు చెప్పదొడగెను:—

"ఇంద్రాదులనుండి దివ్యాస్త్రములను బడసి, దేవతలకు సహాయంచేసి అర్జునుడు త్వరలోనే తిరిగి నీకడకు రాగలడు. అంతదాక నీవుగూడ తపస్సు చేయుచుండుము. తపస్సునకు సాధ్యముకానిది ఉండదుకదా! కర్ణుని సామర్థ్యము నాకు (ఇంద్రునకు) తెలియును. అతడు మహావీరుడు. గొప్ప యుద్ధ విశారదుడు. కుమారస్వామివంటి శూరుడు. వరప్రసాదముచేత పుట్టినవాడు. ఐనను, అతనిని గూర్చిన భయము నీకు అవసరములేదు. అతని కన్నను అన్నింటిలోను అర్జునుడు అధికుడు. అర్జునునిలో పదునారవవంతు బల శౌర్యాదులు గూడ కర్ణునకులేవు. అర్జునుడు నీకడకు రాగనే నీ మనస్సులోని భయము పూర్తిగా పోవును. లోమశుని యుపదేశము ప్రకారము నీవు (యుధిష్ఠిరుడు)గూడ సోదరులతో తీర్థయాత్రలు చేయుము. దానివలన గలుగు ఫలమును నీకు లోమశుడు చెప్పగలడు" అని చెప్పి లోమశుడు పిదప అర్జునుడు అన్నగారికి పంపిన సందేశమునుగూడ ఇట్లు చెప్పదొడగెను:—

"రాజా! నన్ను నీకు ధర్మోపదేశము చేయుమని అర్జునుడు చెప్పెను. నీ వెంటనే ఉండి తీర్థ యాత్రలు చేయుచు నీకు రాక్షసాదుల వలన భయములేకుండ నిన్ను రక్షించుచుండుమనెను. దధీచుడు ఇంద్రుని, ఆంగిరసుడు సూర్యుని రక్షించినట్లు నిన్ను రక్షింపుమని నన్ను కోరెను. కనుక రాజా! ఇంద్రుడు, అర్జునుడు చెప్పిన మేరకు నేనుగూడ మీతోపాటు తీర్థయాత్రలకు వెడలి మిమ్ము రక్షించుచుండెదను. నేను ఇదివరకే రెండు సార్లు సమస్త తీర్థయాత్రలు చేసితిని. ఇది మూడవసారి యగును. పూర్వము అనేక రాజర్షులు తీర్థయాత్రలు చేసి మహా పుణ్యమును సంపాదించిరి. కుటిలుడు, పాపాత్ముడు, విద్యావిహీనుడు, ఇంద్రియ నిగ్రహములేనివాడు తీర్థయాత్రలు చేయజాలడు. నీవు ధర్మాత్ముడవు. సర్వ సంగ విముక్తుడవు. కనుక ఈ తీర్థయాత్రలు చేసినచో ఆ గుణములు ఇతోధికముగ నీయందు శోభిల్లగలవు. భగీరథ గయ—యయాతి రాజులవలెనే నీవుగూడ ధర్మపరుడవై యాత్రలు సలుపుము" అని లోమశుడు ధర్మరాజుతో చెప్పెను.

## ధర్మజాదుల తీర్థయాత్ర

ఆ మాటలు విని యుధిష్ఠిరుడు లోమశునితో నిట్లనెను;— "మహాత్మా! నీ వచనములను విన్నందువలన నాకు అధికమగు హర్షము కలిగినది. అందుచేత నీకు ఏమియు బదులు చెప్పజాలకున్నాను. దేవేంద్రుడు నన్ను స్మరించినాడనగా అంతకన్న ఎక్కువ యేమి కావలెను? నాకన్న అధికుడెవడున్నాడు? తీర్థయాత్రలు చేయుటకు ధౌమ్యాచార్యులు నన్ను పూర్వమే ప్రోత్సహించియుండెను. ఇప్పుడు నీవుగూడ ఉపదేశించితివి. ఇంద్రాజ్ఞయైనది. కనుక లోమశ మహామునీ! నీ వెప్పుడు తలచినప్పుడే బయలుదేరుదము."

(సశేషం)

ఆ మాటలు విని లోమశుడు 'రాజా! ఇందరు నీ వెంట తీర్థయాత్రకు బయలుదేరకూడదు. తక్కువ జనముతో పోవలెను. అప్పుడే నీవు ఇష్టము వచ్చినచోటికి ఏ యిబ్బందియు లేక అల్ప సంఖ్యాకులతో సుఖముగా తిరుగగలవు'. చెప్పగనే యుధిష్ఠిర మహారాజు, అశక్తులను, శీతవాతాతపములను సహించని వారిని, మిష్టాన్నమును భుజించి సుఖముగా కాలము గడపువారిని ఆపి, ధృతరాష్ట్రుని కడకుపంపెను. ధృతరాష్ట్రుడు ఆ బ్రాహ్మణుల నందరి హస్తిపురిలో ఆదరించి ఉంచెను. ఆ తరువాత, యాత్రా క్లేశములను సహించునట్టి కొద్దిమంది బ్రాహ్మణులతోను, లోమశ మహామునితోను ధర్మరాజు కామ్యకవనమునందే మూడు నాళ్లుండి తరువాత అచటి మునుల అనుజ్ఞగైకొని అల్ప పరివారముతో తీర్థయాత్రకు బయలుదేరెను. అప్పుడు కామ్యకవనములోని బ్రాహ్మణులందరుగూడ ధర్మజాదుల వెంట తీర్థయాత్రలకు పోవుటకు అతనిని ఇట్లు వేడుకొనిరి. "రాజా! నీ వెంటనే యాత్రలు సుఖముగా ఏ భయములు లేక జరుగును. నీవు మమ్ము రాక్షసాదుల నుండి కాపాడుచుందువు. నీ వలన మేము యాత్రలు చేసి సమస్తపాపములను పోగొట్టుకొనెదము. మా యాశీర్వాదముచేత నీకు గూడ సద్గతి ప్రాప్తించును. నీకు బ్రాహ్మణుల యెడ ఏ మాత్రము భక్తిశ్రద్ధలున్నను ఈ కోరిక నెరవేర్చుము." అని

విని యుధిష్ఠిరుడు సంతసించి వారందరి రాకకు గూడ లోమశ-ధౌమ్యులనుండి అనుజ్ఞగొని వారితోను, ద్రౌపదీ సహిత సోదరులతోను ధౌమ్య-లోమశులవెంట తీర్థయాత్రకు బయలుదేరిరి.

అప్పుడు వారికడకు వ్యాసమహాముని, పర్వత-నారదులు వచ్చిరి. వారిని ధర్మజుడు పూజించెను. ఆ మునీశ్వరులు ధర్మజాదులతో నిట్లనిరి :— "ధర్మజ-భీమ-నకుల-సహదేవ-ద్రౌపదులారా! తీర్థయాత్రలకై మీరు బయలుదేరులోపల మా మాటలను వినుడు. యాత్రకు పోవుటకు ముందు తీర్థములపై శ్రద్ధాభక్తులు వహించి, శరీరనియమముగలవారై యుండుట 'మానుష వ్రతము' అనబడును. మనస్సుచేత బుద్ధిని పరిశుద్ధము చేసికొనుట 'దైవవ్రతము' అనబడును. సర్వప్రాణులయందు మైత్రీబుద్ధితో, మనోబుద్ధీంద్రియములను వశములో నుంచుకొని తీర్థయాత్ర చేయవలెను. మీకు మానుషవ్రతము కలదు. కాని దైవవ్రత యుక్తులై యాత్రచేసినచో తత్ఫలము పూర్తిగా మీకు లభించును." వారి మాటలువిని 'ఆ ప్రకారమే ఉండెదము' అని చెప్పి ధర్మరాజు వ్యాసాదులకు నమస్కరించి తమ్ములతోను, బ్రాహ్మణులతోను, ధౌమ్య-లోమశులను అనుసరించి తీర్థయాత్రలకై వెడలిపోయెను. వారితోపాటు ఇంద్రసేనాది సేవకులను, రథములను, వంటవారును, ఇతర పరిచారకులును అనుసరించగా పాండవులు ఆయుధములు ధరించి తూర్పుదిక్కుగా బయలుదేరి వెడలిపోయిరి.

త్రోవ నడచుచు ధర్మరాజు లోమశమహామునితో నిట్లనెను:— "మహాత్మా! నేను సాత్త్విక గుణములు కలవాడనైనను, నాకు అనేక దుఃఖములు సంప్రాప్తములగుచున్నవి నాకు గలిగినన్ని సంకటములు ఇతరులెవ్వరికిని కలుగవు. దుర్యోధనాదులు సద్గుణ రహితులై అధర్మ పరులయ్యును సుఖ సంపదల ననుభవించుచున్నారు. దీనికి కారణమేమి?" ఆ మాటకు లోమశుడిట్లు బదులు చెప్పెను:—

"రాజా! అధర్మపరులు అభివృద్ధి పొందుచున్నారని నీవను కొనకుము. తొలుత మనుష్యుడు అధర్మము ద్వారా అభివృద్ధిని పొంది, తన ఇచ్ఛానుసారముగా సుఖ సంపదలను—అభ్యుదయమును పొందును. శత్రువులపైన గూడ విజయమును సాధించును. కాని, చివరకు అతడు సమూలముగా నశించును. ఈ విధముగా అధర్మపరులైన రాక్షసాదులు తొలుత అభివృద్ధిని విజయమును సాధించి చివరకు వినాశమొందిన వారి నెందరినో నే నెరుగుదును దేవతలు ధర్మపరులగుట, రాక్షసులు అధర్మపరులగుట నేను పూర్వమే చూచినాను. రాక్షసులను గర్వము ఆవేశించెను దాని వలన అభిమానము, దానిచేత క్రోధము, అందువలన సిగ్గులేక తిరుగుచు వారు నశించిరి. అట్టి వారిని, ఓర్పు, లక్ష్మి, స్వధర్మము వీడెను లక్ష్మి దేవతలను చేరెను. ఆ లక్ష్మిచేత రాక్షసుల మనస్సును దర్పము, అభిమానము ఆవేశించెను. దానిచేత హరి కీర్తి నశించి వారు క్షయమును పొందిరి. దేవతలు క్షమావంతులై తీర్థయాత్రాది సత్కర్మలుచేసి పాప పంకమునుండి విముక్తులై శ్రేయస్సులను పొందిరి. ఈ విధముగా దేవతలు ఉత్తమ వినయము గలవారై దానము పుచ్చుకొనక సత్కర్మలను అనుష్ఠించి సంపదలను పొందిరి కనుక రాజా! నీవుగూడ దేవతలవలెనే ధర్మ పరుడవై తీర్థయాత్రలు చేసి తిరిగి నీ రాజ్యమును నీవు పొందగలవు నీలాగే పూర్వము, నృగ-శిబి-భగీరథాది రాజులు తీర్థ సేవనముచేసి ధర్మాత్ములై సమస్త సంపదలను ఇంద్ర వైభవమును అనుభవించిరి. అధర్మపరులైన దుర్యోధనాదులు, రాక్షసులవలె ఇప్పుడు సంపదలు, సౌఖ్యములు అనుభవించుచున్నను చివరకు తప్పక నశించిపోయెదరు. ఇందులో సంశయము ఏ మాత్రము లేదు."

ఆ విధముగా వారు తీర్థయాత్రలు సలుపుచు నైమిశారణ్యమునకు వచ్చిరి. ఆయా తీర్థములందు పాండవులు గోదానము-ధన దానముచేసి . ఇట్లు అనేక తీర్థములను సేవించుచు చాతుర్మాస్యాది వ్రతములు సలుపుచు వారు గయాక్షేత్రమునకు వచ్చిరి. అచట గయుడను రాజునకు నివాసమగుగా యీ పర్వతమును సేవించిరి అందు అనేక బ్రాహ్మణులు వేద వేదాంగ విదులు ఉండిరి వారిలో 'శమఠుడు, అను బ్రాహ్మణుడు ధర్మరాజుతో గయ చరిత్ర ఇట్లు చెప్పెను:—

"రాజా! 'అమూర్తరయుడు అను రాజునకు పుత్రుడగు 'గయుడు, అను వాని కథ వినుము అతడు భూరి దక్షిణలచే అనేక యజ్ఞముల నిచటచేసెను గుట్టలు గుట్టలుగా అన్న రాసులు దానముచేసెను ఆ యజ్ఞమునందు నేతి కాలువలు, పెరుగునదులు, వ్యంజనముల ప్రవాహములు అనేకములుగా పారెను అందరు భోజనము చేసి తృప్తులైన తరువాతగూడ ఇరువదియైదు అన్న పర్వతములు మిగిలియుండెనట. ఇతరులెవరును, అట్లు యాగములు చేసియుండలేదు. ఇసుకను, నక్షత్రములను, వర్షధారలను లెక్కించుట యెంతకష్టమో, గయుడు యాగములలో ఇచ్చిన దక్షిణలను గూడ లెక్కపెట్టుట అంత అసాధ్యము. ఇట్లు అనేక యాగములతడు బ్రహ్మ సరస్తీర్థమునందు సలిపెను"

ఆ కథవిని ఆశ్చర్యపడి ధర్మరాజు గయా క్షేత్రమునుండి ముందుకు సాగిపోయి అగస్త్యాశ్రమము చేరెను. అచట నున్న 'దుర్జయ మణిమతీ' నగరములో నివాసముచేసెను అప్పుడు లోమశునితో ధర్మరాజు, 'మహాత్మా! ఇచట అగస్త్యుడు వాతాపి దానవుని ఏల నశింపజేసెను? మనుష్య హంతకుడగు ఆ వాతాపి దానవునకు ఎట్టి మహిమ ఉండెను? అతని యెడల అగస్త్య మహామునికి క్రోధ మేల కలిగెను? చెప్పుడు.' అని యడుగగా లోమశు డా కథ యిట్లు చెప్పదొడగెను:—

(సశేషము)

# చైతన్యమూర్తులు

— కల్యాణసింగ్

## కందుకూరి వీరేశలింగం

నిద్రాణమై ఉండిన తెలుగు జాతిని మేలుకొలిపిన వైతాళికుడు కందుకూరి వీరేశలింగం. తెలుగు సాహిత్య నందనోద్యానం మరుభూమిగా మారినప్పుడు ఆ మరుభూమిలో నవజీవనాన్ని ప్రవహింపజేసి కొత్త మొక్కలను పాతి అంటులు కట్టి ఉత్తమ ఫలాలను పండించిన ఉద్యాన కర్షకుడు ఆయన. సంఘంలో అవినీతి అంటువ్యాధిగా వ్యాపించినప్పుడు మూఢ విశ్వాసాల ఉన్మాదం ప్రజలలో ముదిరినప్పుడు చికిత్సకు పూనుకొన్న భిషగ్వరుడు ఆయన.



హెర్క్యులీజ్ అనే గ్రీకు మహాబలుడు సాధించిన పది ఘన విజయాలు ప్రఖ్యాతమైనవి. అందులో ఒకటి ఆజియన్ రాజు పశుశాలను పరిశుభ్రపరచడం. ఆ శాలలలో 3000 ఎద్దులు ఉండేవట. అవి పదేళ్ళపాటు మురికిలో దొర్లుతూ ఉండినవట. ఆ ప్రదేశంలో పెన్యూస్, ఆల్ఫ్యూస్ అనే రెండు నదులను ప్రవహింపజేసి ఆ పశువులను, ఆ స్థలాన్నీ పరిశుద్ధం చేశాడట హెర్క్యులీజ్. ఈ ఉదంతంవల్ల తేలే విషయం ఏమిటంటే సంస్కర సంస్కారానికి పూనుకునేముందు పనికిమాలిన చెత్తా చెదారాన్నీ కంపుకొట్టే కుళ్ళును తొలగించవలసి ఉంటుందని. దుర్నీతి, దురభ్యాసాలు, అర్థంలేని ఆచారాలు, వివేకంకాని విశ్వాసాలు ప్రబలిన కాలంలో వీరేశలింగం హెర్క్యులీజ్ పడినంత ప్రయాస పడవలసి వచ్చింది.

ఐతే హెర్క్యులీజ్ మహాబలుడు, మహావీరుడు. వీరేశలింగం శారీరికంగా దుర్బలుడు. ఆయనకు పుట్టుకనుండి నీరసమే. ఎప్పుడూ అనారోగ్యమే. ఎన్నో గండాలు తప్పించుకొని బ్రతికాడు. ఉబ్బసం నిరంతరంగా పీడిస్తూ ఉండేది. ఐనా ఆయన మానసిక శక్తి మాత్రం అసామాన్యమైనది. ఆయన పెద్ద సంపన్నుడేమీ కాదు. ఆంగ్లంలో ఉన్నత విద్య అభ్యసించినవాడు కాదు. పెద్దపదవి కలవాడు కాదు. అధికారం అసలే లేదు. బడుగు బడివంతులు. ఐనా ఆయన సాధించిన విజయాలు బలవంతులు, ధనవంతులు, అధికారులు పదుగురు కలిసినా సాధించలేనివి.

'క్రియాసిద్ధి సత్త్వే భవతి మహతాం నోపకరణే' మహనీయులకు వారి మహత్త్వంవల్లనే కార్యసిద్ధి అవుతుంది కాని ఉపకరణాలవల్ల కాదు కదా.

తెలుగు సాహిత్యంలో ఎన్నో కొత్త బాటలు వేశాడు వీరేశలింగం. తెలుగు ప్రజల సర్వతోముఖ వికాసానికి దోహదం చేశాడు. అస్పృశ్యులను ఆదరించాడు. అబలలకు అండగా నిలిచాడు. అంధకారంలో అలమటించే అనాథలకు ఆశాజ్యోతిని చూపించాడు. తన దేహం, తన గేహం, తన కాలం, తన ధనం, తన విద్య భాషాసేవకు, సంఘసేవకు, మానవ సేవకు వినియోగించాడు. తెలుగు దేశ చరిత్రలో నూతన యుగాన్ని ప్రారంభించాడు.

శరీరంలోని అన్ని అవయవాలూ సరిసమానంగా వృద్ధి పొందితేనే సౌష్ఠవం కాని ఒక అవయవం విపరీతంగా పెరగడం, ఒక అవయవం గిడసబారిపోవడం రోగ లక్షణాలైనట్లు, మానవ జీవనానికి సంబంధించిన అన్ని రంగాలలోను అభివృద్ధి జరిగితేనే నిజమైన అభ్యుదయం అని వీరేశలింగం అభిప్రాయం. సాంఘికాభివృద్ధితోపాటు రాజకీయ ప్రగతికూడా ఆవశ్యకమని ఆయన గుర్తించినా సాంఘికాభివృద్ధికే ఆయన ప్రాముఖ్యం ఇచ్చాడు. సంఘంలోని వ్యక్తులకు సంస్కారం లేకపోతే రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినా ప్రయోజనం ఉండదని ఆయన నమ్మకం. అందుకే ఆయన రాజకీయాలను అంతగా పట్టించుకోలేదు.

ప్రతి దినమూ కనీసం ఒక్క సత్కార్యమైనా చేయాలనే సంకల్పంతో దైవ చింతనలో చివరి క్షణంవరకూ జీవితాన్ని మానవ సేవకు అంకితం చేసిన ఆరాధ్యుడు వీరేశలింగం.

## కాశీనాథుని నాగేశ్వరరావు

విద్యా వివాదాయ ధనం మదాయ
శక్తిః పరేషాం పరపీడనాయ
ఖలస్య సాధో ర్విపరీత మేతత్
జ్ఞానాయ దానాయ చ రక్షణాయ.

దుర్జనుల విద్య వివాదంకోసమూ, వారి ధనం గర్వం కోసమూ, వారి శక్తి పరపీడనకోసమూ ఐతే సజ్జనుల విద్య జ్ఞానం కోసమూ, వారి ధనం దానం కోసమూ, వారి శక్తి రక్షణకోసమూ వినియోగింప బడుతున్నాయి.










నవోదయానికి నాందిపలికిన "అగ్రో"

(పైన) ఒకగ్రామానికి అరుదెంచిన "అగ్రో" యంత్రం—క్రొత్త జీవితానికి ప్రాతిపదిక.

(పైన-ఎడమవైపున) బీడు భూములను, పంట పొలాలుగా మారుస్తున్న జలాలు.

(పైన-కుడివైపున) డ్రిల్లింగ్ యంత్రాన్ని అమరుస్తున్న దృశ్యం.

మధ్యలో) గొట్టపుబావి—రైతుకు పెన్నిధి.

ఎడమవైపున) భూమిని చదును చేస్తున్న బుల్డోజరు.

(కుడివైపున) పాత వ్యవసాయ పద్ధతులకు స్వస్తి

గుమాస్తా ఉద్యోగానికైనా విద్యాయోగ్యతా శిక్షణ అవసరం కాని రాజకీయ వృత్తికి ఏ అర్హతా శిక్షణా అక్కరలేదనే అపవాదం ఉంది. తాను చర్చింపవలసిన—పరిష్కారం సూచింపవలసిన—ఏ రాజకీయ సమస్యనైనా ఆద్యంతం క్షుణ్ణంగా అధ్యయనంచేసి కూలంకషంగా పరిశీలించడం గోఖ్లే విశిష్టత. ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో ఆయన బడ్జెట్ ఉపన్యాసాలు ఆరితేరిన ఆంగ్లేయ నిపుణుల ప్రశంసలు పొందాయి.

రాజకీయాలలో ప్రతిభా ప్రావీణ్యాలకంటె నీతికీ శీలానికీ ప్రాధాన్యం ఇచ్చిన శుద్ధాత్ముడు గోఖ్లే. రాజకీయాలను ధర్మబద్ధంచేయడానికి ఆయన భారత సేవక సంఘాన్ని స్థాపించాడు ఆ సంఘ సభ్యులు కొన్ని ప్రతిజ్ఞలు చేయవలసి ఉంటుంది. దేశసేవ చేసేటప్పుడు సొంత ప్రయోజనానికి తావు లేదు. భారతీయులందరూ సోదరులు. కుల మతాల ప్రమేయంలేకుండా అందరి పురోభివృద్ధికి పాటుపడాలి. భారత సేవక సంఘం కల్పించగలిగే భృతితోనే తననూ, తన కుటుంబాన్ని పోషించుకోవాలి. తనకోసం ధనం ఆర్జించే ప్రయత్నం చేయకూడదు. వ్యక్తి జీవితం పరిశుద్ధంగా ఉండాలి. ఎవరితోకాని వైయక్తిక కలహానికి దిగకూడదు.

ఇలాంటి ఆదర్శాలను పాలించడం ఈనాడు మానవ శక్తికి అతీతంగా కనబడుతూ ఉంది. ఐనప్పటికీ స్వాతంత్ర్య సమర కాలంలో అకలంక దేశ భక్తికీ, అఖండ త్యాగానికీ పేరుపొందిన భారత జాతి పునరుజ్జీవనం పొంది పురోగమించడం అసాధ్యం కాదు.

## సర్ రోనాల్డ్ రాస్

శీత జ్వరం మన్యపు జ్వరం అనబడే మలేరియా వస్తే ఉన్నట్టుండి భూకంపం వచ్చినట్టే. ఇది అనాదిగా వస్తున్న వ్యాధి. ముఖ్యంగా ఉష్ణ దేశాలలో దీని ప్రాబల్యం ఎక్కువ. దీనివల్ల చనిపోయేవారి సంఖ్య లక్షలలో ఉంటుంది. చావు రాకపోయినా శాశ్వతంగా అశక్తులూ, అనారోగ్యవంతులూ అయ్యేవారి సంఖ్య ఇంకా ఎక్కువగా ఉంటుంది. ఈ వ్యాధి సోకే వారి సంఖ్య ఇంకా ఎన్నో రెట్లు ఉంటుంది.

శతాబ్దాలుగా ఈ వ్యాధి కారణం ఎవ్వరూ కనిపెట్టలేకపోయారు. దాదాపు 70 ఏళ్ళ క్రితం ఈ కారణం కనిపెట్టినవాడు సర్ రోనాల్డ్ రాస్ అనే ఆంగ్లేయుడు. ఆయన సికిందరాబాద్‌లోని మిలిటరీ ఆసుపత్రిలో పనిచేస్తూ ఉండేవాడు.

ఈ వ్యాధి కారణం తెలుసుకోడానికి ఆయన పడిన శ్రమ, చేసిన పరిశోధన ఇంతంత కాదు. మలేరియాతో బాధపడే వేలకొలది రోగుల రక్తాన్ని పరీక్షించాడు. ఈ రోగులందరి రక్తంలోను ఒక విధమైన బదనిక (వేరొక జంతువును ఆశ్రయించి బ్రతికే జీవి) కనబడింది. ఐతే ఈ బదనిక మనిషి శరీరంలో ఎలా ప్రవేశించింది ?

దోమలను పట్టుకొని శరీర ఛేదనం చేయగా మలేరియా రోగుల శరీరంలో కనబడిన బదనికల వంటి జీవులే దోమలలో కూడా కనబడ్డాయి. మలేరియా ప్రబలంగా ఉన్న ప్రాంతాలలో ప్రయోగాలు చేశారు. ఆ ప్రాంతాలలో దోమ తెరలో నిద్రించిన వారికి జ్వరం రాలేదు. దోమ కాటునకు గురిఐనవారికి జ్వరం సోకింది. దీనివల్ల మలేరియా వ్యాధికి కారణం దోమలే అని తేలింది దోమల శరీరంలో ఈ బదనికలు ఉంటాయి. అవి మనిషిని కుట్టినప్పుడు వాటి శరీరంలోని బదనికలు మనిషి శరీరంలో ప్రవేశిస్తాయి. మామూలు కంటికి కనబడని ఈ సూక్ష్మజీవులు భయంకరమైన మలేరియా వ్యాధిని కలిగించే ఉపద్రవాలు. ఈ జీవులు మనిషి శరీరంలో ప్రవేశించి అక్కడ కొంత కాలం నివసించి మలేరియాను సంక్రమింపజేసి శరీరాన్ని బలహీనపరిచి, ఆరోగ్యాన్ని పాడుచేసి తుదకు మరణంకూడా కలగజేయవచ్చును.

ఐతే ఈ బదనికలు అన్ని దోమలలోనూ ఉండవు. అనోఫలీజ్ అనే జాతికి చెందిన ఆడ దోమ ద్వారానే మలేరియా వ్యాపిస్తుంది. ఈ విషయం కనిపెట్టడానికి రాస్ ఎన్నో సంవత్సరాలు పరిశోధన చేయవలసి వచ్చింది. ఎన్నోరకల దోమలను సేకరించి, వేలకొలది రోగుల రక్తాన్ని సంగ్రహించి సూక్ష్మదర్శిని యంత్రాలతో నిరంతరం పరిశీలించి తుట్టతుదకు మలేరియా రహస్యాన్ని కనిపెట్టి లోకానికి మహోపకారం చేసిన మహనీయుడు సర్ రోనల్డ్ రాస్.

ఈ పరిశోధన ఫలితంగా మలేరియా వ్యాధికి కారణమైన దోమజాతిని ధ్వంసం చేసి మలేరియాను నిర్మూలించడానికి ప్రపంచ వ్యాప్తంగా కృషి జరుగుతూంది. ఈ తుది విజయాన్ని సాధ్యం చేసినవాడు సర్ రోనల్డ్ రాస్.



## రచయితలకు విజ్ఞప్తి

ప్రజలకు ఆసక్తికరమైన వర్తమాన పరిస్థితులను గురించి "ఆంధ్ర ప్రదేశ్" పత్రిక కోసం ప్రత్యేకంగా రాసిన రచనలు కోరబడుచున్నవి.

సాంఘిక, సాంస్కృతిక విషయాలను గురించిన రచనలూ, ప్రజలకు విజ్ఞాన ప్రదములైన రచనలు కూడా పంపవచ్చు. ప్రకటించిన రచనలకూ ఫొటోలకూ, పారితోషికం చెల్లించబడుతుంది.

పి. వామనరావు

"ఆంధ్రప్రదేశ్" పత్రిక ప్రధాన సంపాదకులు, సమాచార పౌరసంబంధ యాత్రిక శాఖ, హైదరాబాదు.

# నగరంలో

## నగరంలో ఉగాది కవి సమ్మేళనం

ఆధునిక కవితా వేదిక 'నవ్య కళారాధన' సాహితీ సంస్థ ఆధ్వర్యాన ఏప్రిల్ 6 వ తేదీన కళాభవన్ హాలులో 'ఉగాది' కవి సమ్మేళనం జరిగింది. జంట నగరాలలోని అనేక సాహితీవేత్తలు, కవులు, పండితులు హాజరయ్యారు. 'నవ్యకళారాధన' అధ్యక్షులు శ్రీ టి. శేషాచలం స్వాగతం పలికారు. సాహిత్య అకాడమీ ప్రధాన కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షత వహించారు. శ్రీ దివాకర్ల వేంకటావధాని ప్రారంభోపన్యాసంలో కవితా ప్రతిభను గూర్చి వివరించి, కవి సమ్మేళనం ప్రారంభించారు. శ్రీ దేవులపల్లి రామానుజరావు మాట్లాడుతూ ఆధునిక కళను ఆరాధించడం కళాకారుల ముఖ్య కర్తవ్యాల్లో ఒకటిని గుర్తుచేశారు.

సర్వశ్రీ పోతుకూచి సాంబశివరావు, శశాంక, బోయి భీమన్న; ఉత్పల సత్యనారాయణాచార్య, ఆరిపిరాల విశ్వం; పి. ఎస్. ఆర్. ఆంజనేయశాస్త్రి; గంధం జోయెల్; కె. శివారెడ్డి శ్రీమతి నాయని కృష్ణకుమారి తమ కవితలను చదివి వినిపించారు.



హైదరాబాదులోని ప్రకృతి చికిత్స ఆసుపత్రిలో "ప్రకృతి" మాసపత్రిక స్వర్ణోత్సవ సంచికను ఏప్రిల్ 12 వ తేదీన విద్యా మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి ఆవిష్కరించారు



చేనేత పరిశ్రమ శాఖామాత్యులు శ్రీ భగవంతరావు హైదరాబాదులో ఏప్రిల్ ఐదవ తేదీన 16 అఖిల భారత చేనేత వారోత్సవాలను ప్రారంభించారు.



సికింద్రాబాదు ప్లాజా టాకీసులో ఏప్రిల్ 2 వ తేదీన తూర్పు జర్మనీ చలన చిత్రోత్సవానికి ఆంధ్రప్రదేశ్ గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.



ఆరోగ్య శాఖామాత్యులు శ్రీ ఇబ్రహీంఅలీ అన్సారి ఏప్రిల్ 7 వ తేదీన ఇండియన్ మెడికల్ అసోసియేషన్‌లో ప్రపంచ ఆరోగ్య దినోత్సవానికి ప్రారంభోత్సవం చేశారు.

# కోకా-కోలా సాంగత్యం బ్రతుకే ఒక సారస్యం

సీరియల్

# తిరస్కృతి

## —వాసిరెడ్డి సీతాదేవి

### జరిగిన కథ

సత్యం, సూర్యం అన్నదమ్ములు. మేనమామ కూతురు సరళ తనను పెళ్ళి చేసుకోనన్నదని, సత్యం ఇంటినుండి వెళ్ళిపోయాడు. చిన్ననాటి గురువుగారైన కేశవరావుగారి సలహాతో 'శాంతినికేతన్'లో చేరి చిత్రకళ అభ్యసించాడు. ఒకనాటి చిత్రకళా ప్రదర్శనకు కేశవరావు గారూ, వారిఅమ్మాయి విమల వచ్చారు. సత్యం - మిత్రుడు మాధవరావునకు, విమల పరిచయమైంది ఒక రోజు కారులో వాళ్ళిద్దరూ హోటల్‌కు పోయి కాఫీ తీసుకొన్నారు. మాధవరావు తన మనస్సులోని విషయాన్ని విమలకు చెప్పడానికి ప్రయత్నించాడు. మరోసారి వింటానని విమల చెప్పింది, తిరిగి ఇంటికి వచ్చారు. విమల మనస్సులో కలవరం బయలు దేరింది. విమల సత్యం గదిలోకి అడుగు పెట్టింది. సత్యం కిటికీ దగ్గరకెళ్ళి బయటకు చూస్తున్నాడు.

మనసులోని సంచలనాన్ని అదుపులో పెట్టుకోవటానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు.

విమల ఎందుకు అంతగా ఏడ్చింది ? అంత విజ్ఞానవతి, ఎంతో గంభీరంగా కన్పించే ఆమె, పసి పిల్లలా ఎందుకు ఏడ్చింది ఆమె దుఃఖం యిప్పటికిప్పుడు కలిగిన బాధవల్ల వచ్చిందికాదు ఎంతోకాలంగా హృదయంలో ఘనీభవించిన ఆవేదన ఒక్కసారిగా చల్లనిగాలి తగిలిన మేఘంలా భోరున కురిసింది.

ఆ దుఃఖం వెనక ఏదో దాగిన రహస్యం వుందనిపిస్తుంది, అంటే తాను ఊహించింది సత్యమేనా ?

తను విమల గురించి కలలోకూడా మరోలా ఊహించలేదు. ఇంతవరకూ ఆమెను గౌరవిస్తూ వచ్చాడు, మాష్టరుగారి కూతురిగా.

విమలా మాధవ్‌ల వివాహం అయితే బాగుండునని తను ఎన్నోసార్లు అనుకున్నాడు.

మాధవ విమల్ని ప్రేమిస్తున్నాడేమోననే అనుమానం ఎన్నోసార్లు తనకు కలిగింది.

ఒకవేళ అది నిజం అయితే, మాధవ్ విమల్ని ప్రేమించటం నిజం అయితే ?

సత్యం శరీరం భయంతో బిగుసుకుపోయింది. కిటికీ సువ్వల్ని ఇంకా గట్టిగా పిడికిలి బిగించి పట్టుకున్నాడు. చేతుల మీద నరాలు పొంగాయి.

ఇదికూడా నిజం కాదేమో ? మాధవ్ విమల్ని ప్రేమిస్తూ వుంటే తనకైనా చెప్పడా ? అతనికి తన ప్రేమను వెల్లడించటానికి సంకోచం ఎందుకుండాలి ! మాధవ్ స్వభావం మనస్సులో దేన్నికూడా దాచలేనిది.

సత్యం అప్రయత్నంగా కిటికీ సువ్వల్ని వదిలి వెనుదిరిగి చూచాడు. విమల సత్యంకు దగ్గరగా గోడవైపుకు తిరిగి గోడమీద తల ఆనించి వెక్కి వెక్కి ఏడుస్తూంది.

సత్యం తనకు తెలియకుండా ఆమె దగ్గరకువెళ్ళి ఆమె వీపుమీద ప్రేమగా చెయ్యి వేశాడు

గిర్రున తిరిగిన విమల ఒక్కసారిగా ముఖాన్ని సత్యం గుండెల్లో దాచుకొన్నది.

సత్యం? కాదు? అతనిలోని పురుషుడు ఆవేగముతో, ఉద్వేగంతో, ఉద్రేకంతో, ఆవేశంలో ఉన్న ఒక చేతిలోకి వెయ్యి చేతుల బలంరాగా, ఆమెను గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు.

విమల ఆ క్షణం కోసరమే యుగాలగా ఎదురుచూస్తున్నట్లు, సత్యం గుండెల్లోకి ఒదిగిపోయింది.

ఎంతో కాలంగా ప్రయాణంచేసి, అలసిపోయివున్న బాటసారి తుది మజిలీని చేరినట్లు, పద్యానికి చివరిపాదం స్ఫురించక తల బద్దలు కొట్టుకుంటున్న కవికి అకస్మాత్తుగా అనుకోకుండా ముగింపు దొరికినట్లు, విమల సత్యం గుండెలమీద తల ఆన్చి అతని కౌగిలిలో ఇమిడిపోయి అనిర్వాచనీయమైన అనుభూతిని ఆస్వాదించసాగింది.

అకస్మాత్తుగా సత్యం కాలిపోతున్న వస్తువును ఒదిలేసినట్లు విమల్ని వదిలేసి దూరంజరిగి నిల్చున్నాడు.

విమల పూర్తిగా ఈ లోకంలోకి రాలేదు. సత్యం స్పర్శను ఇంకా ఆమె శరీరం అనుభవిస్తూనే వుంది.

"క్షమించండి." అన్నాడు సత్యం. అపరాధిలా తలవంచుకొని.

విమల చివ్వున తలెత్తి చూసింది. దీనంగా చూసింది, మధురమైన కల క్షణంతో కరిగిపోయినట్లయింది విమలకు.

"క్షమించండి." విజ్ఞానవతి అయిన మిమ్మల్ని నేను ఎంతో గౌరవిస్తున్నాను, కలలోకూడా అవమానించలేదు."

"మీరు అమాయకంగా పసిపిల్లలా ఏడుస్తూంటే నాకు తెలియకుండానే" ఆ పైన ఏం చెప్పాలో తెలియని వాడిలా ఆగిపోయ్యాడు సత్యం.

అతని కంఠంలో, ముఖంలో, పశ్చాత్తాపం స్పష్టంగా కనిపిస్తోంది.

విమల సత్యం ముఖంలోకి అసహాయంగా చూసింది. ఆమె పెదవులమీద రేఖామాత్రంగా గోలునవ్వు వెలసి అంతలోనే విరిగిపోయింది.

అర్థం చేసుకోగల హృదయానికి ఆ నవ్వులో ఎన్ని విషాద గీతాలు వినిపిస్తాయో !

సత్యం అదేమీ గమనించలేదు. పెద్ద అపరాధం చేసినట్లు కుంగిపోతున్నాడు.

"అమాయకత్వంలో ఇంత ఆకర్షణవుందని నాకు తెలియదు. విజ్ఞానం, వివేకంలో లేని అద్భుతమైన బలం అమాయకత్వంలో వుందని నాకు తెలియదు ఇంతకాలం ! స్త్రీ అమాయకత్వంతో పొందగల అమూల్య జీవితాన్ని విజ్ఞానంతో పొందలేదని ఇవ్వాళ నాకు అర్థం అయింది." అంది విమల ఆవేశంగా.

సత్యం కళ్లు పెద్దవి చేసుకొని విమల్ని చూస్తూ వుండి పోయాడు.

"ఈనాటి స్త్రీలోకం విజ్ఞానోపార్జనకోసం ఎంత అమూల్యమైన వస్తువును పోగొట్టుకుంటున్నారో ఇప్పుడే అర్థం అయింది.

వాకిట్లో అడుగుల శబ్దం విని ఇద్దరూ ఉలిక్కిపడి చూశారు

ఒకవ్యక్తి వచ్చినప్పుడు ఇద్దరు వ్యక్తులు ఎందుకు ఉలిక్కిపడతారో ఇదే అర్థం అవుతుంది.

మాధవరావు ఇద్దర్నీ ఓ క్షణం మార్చి మార్చి చూశాడు. అతని చూపుల్లో ఆశ్చర్యం స్పష్టంగా గోచరిస్తుంది.

"సారీ !" అంటూ గిరుక్కున వెనక్కి తిరిగాడు మాధవరావు.

అలా వెళ్ళిపోతున్న మాధవరావును వెనక్కి పిలవాలనుకున్నాడు సత్యం. కాని వెలా వెలాపోతూ చూస్తూ వుండి పోయాడు.

వాతావరణంలోని గాంభీర్యాన్ని అర్థం చేసుకున్న విమల లేచి గది బయటకు నడిచింది.

× × × × ×

ఆరు గంటలకే చలి ప్రారంభం అయింది. ఎక్కడో కోల్డు వేవ్ వచ్చి వుంటుంది అనిపించేలా వుంది.

సరళ పొగడ చెట్టు క్రింద వున్న రాతి మీద కూర్చొనివుంది అరచేతి మీద గడ్డం ఆనించి ఏదో దీర్ఘంగా ఆలోచిస్తోంది.

అప్పుడే లోపలకు వస్తున్న సూర్యం అలాగే నిల్చొని పోయాడు, సరళను చూస్తూండి పోయాడు. తెల్లని దుసులో, ముఖం మీద నీరెండ పడుతూవుంటే దీర్ఘాలోచనల్లో మునిగి చెట్టు కింద కూర్చొని వున్న సరళ, ఏ గంధర్వ కుమారుడి కోసమో వేచివున్న వనదేవతలా కన్పించింది.

వనదేవత గంధర్వ కుమారుడికోసం చూస్తుందేమో కాని ఈ సరళ మాత్రం సత్యం కోసమే ఎదురు చూస్తోంది అనుకుని నిట్టూర్చాడు సూర్యం.

సరళకు తను ద్రోహం చేశాడు. ఆనాడు తన స్వార్థంతో సత్యంతో సరళ పెళ్లి జరగకుండా చేసాడు. ఆ తర్వాత పశ్చాత్తాపంతో కుంగిపోయాడు అన్నయ్యకు చేసిన ద్రోహాన్ని తల్చుకుంటూ.

అన్నయ్య వెళ్ళిపోయిన కొద్ది రోజులకే తను సరళను నిజంగా ప్రేమించడం లేదని తెలుసుకున్నాడు. ఆమెను కేవలం తన మామయ్య కూతురుగానే, సన్నిహితురాలుగా భావించాడు, అన్నయ్య మీద తనకు ముందు నుంచీ అసూయ వుండేది. ఆ అసూయ వల్లనే అన్నయ్యను సరళనుంచి వేరు చేయాలని బాధ పడ్డాడు. అన్నయ్య అంతగా ప్రేమించే సరళను తనదాన్ని చేసుకోవాలని తాపత్రయ పడ్డాడు. దాన్నే ప్రేమ అనుకొని భావించాడు.

సరళ అంటే తనకు చాలా ఇష్టంవున్న మాట వాస్తవమే

అన్నయ్య వెళ్ళిపోయిన ఆరు నెలలకే తనకు కమల పరిచయం అయింది. హాస్పిటల్లో పేషెంటుగా చేరిన ఆ శ్రీమంతుల బిడ్డ తనను ప్రేమిస్తున్నా నన్నప్పుడు. తను ఉక్కిరిబిక్కిరయి పోయాడు ఈ పెద్ద తోట, బంగళా వైభవం అన్నీ తనను మత్తులో ముంచి వేశాయి. అందుకే అమ్మా నాన్నా కబురు చేసి సరళతో వివాహం చేస్తామన్నప్పుడు తాను నిరాకరించాడు.

తను సరళను వివాహం చేసుకోనన్నప్పుడు అందరు ఆశ్చర్య పోయారు. అమ్మా, నాన్నా దుమ్మెత్తి పోశారు. సరళ మాత్రం చాలా చిత్రంగా తన ముఖంలోకి చూసింది ఆ చూపులు ఇంకా తనను వెంటాడుతూనే వున్నాయి.

తన వివాహం కమలతో ఎంతో వైభవంగా జరిగింది. అమ్మా నాన్నా రాలేదు. సరళ మాత్రం వచ్చింది.

"ఏం బావా ? అలాగే నిలబడి పోయావ్ ? " సరళ మాటలకు సూర్యం ఉలిక్కి పడి ఈ లోకంలోకి వచ్చాడు.

"ఇక్కడ, చలిలో, కూర్చున్నావేం ? సరళా!" అన్నాడు సూర్యం.

"నాకు హైదరాబాద్ ఉస్మానియా ఆసుపత్రికి ట్రాన్స్ఫర్ వచ్చింది బావా?" అంది సరళ లేచి నిల్చుంటూ.

తల మీద రాలిన పొగడ పూవులను దులుపుకుంటూన్న సరళను కళ్లు పెద్దవి చేసుకొని చూడసాగాడు సూర్యం.

"ఏమిటి బావా అలాచూస్తావ్! ఆశ్చర్యంగా వుందా?"

"ట్రాన్స్ఫర్ ప్రయత్నిస్తున్నట్టు కూడా చెప్పలేదే?"

"క్షమించు బావా? నీకు చెబితే ఒప్పుకోవని నాకు తెలుసు కాని ..."

"కాని నీకు ఇక్కడ వుండడం ఇష్టం లేదు, అంతేకదూ"?

"అలా నిష్ఠూరంగా మాట్లాడకు బావా!"

సూర్యం మాట్లాడలేదు. ముఖంలో విచారరేఖలు స్పష్టంగా కన్పిస్తున్నాయి.

"మాట్లాడవేం బావా? కోపం వచ్చిందా?"

"కోపం ఎందుకు? నిన్ను అన్ని విధాల అన్యాయం చేశాను. అందుకే బాధపడుతున్నాను." అన్నాడు సూర్యం బరువుగా.

"జరిగిందానికి బాధ పడి ప్రయోజనం ఏమిటి బావా?"

"కనీసం నిన్ను ఒక ఇంటిదాన్ని చేసే బాధ్యతను పూర్తి చేసి అయినా సంతృప్తి పడదామనుకున్నాను."

"లేదు బావా? అలాఅనకు. నేను ఏనాటికయినా పెద్ద బావనే వివాహం చేసుకుంటాను. పెద్ద బావ తప్పక తిరిగి వస్తాడని నాకు నమ్మకముంది."

"నీ ఆరాధనలో అంత శక్తి వుంది. సరళా!"

ఏమో !"

"ఒకవేళ అన్నయ్య . . "

"పూర్తి చేయ్! ఒకవేళ పెద్ద బావ ఎవర్నయినా వివాహం చేసుకొని వుంటే? అనేగా నీ సందేహం!"

సూర్యం మౌనంగా ఆలోచించ సాగాడు.

"నేను విచారించను, పెద్ద బావ ఒక ఇంటివాడయి సుఖంగా వుండటమే నేను కోరేది.

" అలాంటప్పుడు ? " ఆగిపోయాడు ముందుకు మాట్లాడలేక సూర్యం.

" అలాంటప్పుడు నేను అసలు పెళ్ళే చేసుకోను. నీ ప్రోత్సాహంవల్ల మెట్రిక్ పాసయాను. నర్సు ట్రైనింగ్ అయాను. నా కాళ్ల మీద నేను నిలబడ గలిగే శక్తి నీ నాకు ఇప్పించావు. నాకు మానవ సేవ...ముఖ్యంగా జబ్బులో బాధ పడుతున్న వారి సేవ చేయడంలో ఎంతో ఆనందం లభిస్తుంది. ఇంతకంటే నేనింకేం కోరను. నీరుణం ఈ జన్మలో తీర్చుకోలేను బావా.!"

" సరళా! నన్ను ఎగతాళి చేస్తున్నావా ? బాధగా అన్నాడు సూర్యం.

" లేదు బావా! ఎగతాళికాదు. మనస్ఫూర్తిగానే అంటున్నాను. నాకు ఒక మార్గం చూపించావు."

" ఇక్కడే వుండి ఆ ఉద్యోగం చేయవచ్చుగా ? అమ్మ కూడా బాధ పడుతుంది నువ్వెళ్ళి పోతున్నావని తెలిస్తే."

" అత్తయ్య బాధ పడుతుందని నాకు తెలుసు. పెద్ద బావ వెళ్ళిపోయాక సగం చచ్చిపోయినట్లు బ్రతుకుతున్న అత్తయ్యకు మామయ్య మరణం పిడుగుపాటే అయింది."

" అమ్మకోసం అయినా నీవు ఇక్కడ వుండిపోకూడదూ? సరళా నిజం చెప్పు ? నా ఇంట్లో నీకు బాధగా వుందా ? నన్ను తప్పించుకోని వెళ్ళటానికేగా ఈ ప్రయత్నం?"

" మనస్సు కష్టపెట్టుకోకు బావా ? నువ్వు డాక్టరుగావున్న ఆసుపత్రిలో నేను నర్సుగా వుండటం నీకు బాధను కలిగిస్తోందని నాకు తెలుసు. అదీ కాక ఇంటో కమల ... " కమల రావడం చూసిన సరళ మధ్యలోనే ఆగిపోయింది.

" ఏం ఆగిపోయావేం ? బావగారితో, సంధ్యా సమయంలో వన విహారం చేస్తూ, ఏదో నామీద పితోరీలు చెబుతున్నావుగా ఊఁ కానియ్!" చుర చుర చూస్తూ అంది కమల.

సరళ తలవంచుకొని నిలచి ఉంది.

"కమల నీకు రోజు రోజుకు మతి పోతుంది." అన్నాడు సూర్యం చీదరించుకుంటున్నట్లు.

" అవును మతేపోతుంది మీ ఇద్దరి వేషాలు చూస్తుంటే!"

"కమలా !"

"సిగ్గు లేక పోతే సరి !''

" కమలా! ''

" ఏమిటా వెర్రికేకలు!'' సూర్యం కంటే గట్టిగానే రెట్టించింది.

" ఛీ! నువ్వసలు మనిషివి కాదు.'' అన్నాడు సూర్యం ఈసడింపుగా.

" అవును నేను మనిషిని కాదు. ఆవిడ—నీ ముద్దుల మరదలూ— మీరూ—. ఇద్దరే మనుషులు. అన్న చేసుకోబోయే పెళ్ళిని చెడగొట్టిన మీరు మనుషులు.''

నోరు మూస్తావా లేదా ? ''

" ఇంత కాలం నోరు మూసుకోవడం వల్లనే మీ ఆటలకు హద్దంటూ లేకుండా పోయింది. ఆ మరదలంటే అంత మోజు వున్నవాళ్లు ఆమెనే చేసుకోపోయారు ? డబ్బుకు పెళ్ళాం కావాలి. మోజుకు మరదలు కావాలి. ''

" కమలా ! '' అంటూ కోపంతో చివ్వున చెయ్యి ఎత్తాడు సూర్యం.

" బావా ! '' అంటూ అరిచింది సరళ.

గాలిలోకి లేచిన చెయ్యి అలాగే వుండిపోయింది.

" ఏం ఆగిపోయారేం ? కొట్టండి ! '' రెట్టించింది కమల.

సూర్యం ఉలకలేదు పలకలేదు. కోపం శరీరం దహించుకు పోతోంది.

" ఏమిటమ్మా కమలా మొగవాళ్ళను అంత గట్టిగా రెట్టించవచ్చా ? ? అంది అప్పుడే వచ్చిన శాంతమ్మ.

" ఆ నీతులు మేనగోడలుకు చెప్పరాదూ ? పెళ్ళి పెటాకులు లేకుండా... ఎంత బావైతే మాత్రం అంత వెకిలిగా ప్రవర్తించడం వీళ్ళిద్దరి వ్యవహారం నాకు తెలియక పోలేదు.

" కమలా ముందు నువ్వు లోపలకు వెళతావా లేదా ? ''

గర్జించాడు సూర్యం

" వెళతాను. లోపలకే వెళతాను బయటకు వెళ్లాసిన అవసరం నాకేంలేదు. ఈ ఇల్లు నాది. ఆఖరు సారిగా చెప్పి వెళుతున్నాను. ఆవిడ నా ఇంట్లో ఉండటానికి వీలేదు." అంటూ లోపలకు వెళ్ళిపోయింది కమల.

ఆలా వెళుతున్న కమల పుట్టలోకి జరజరా పాకిపోతున్న పాములా కనిపించింది సూర్యం కళ్ళకు.

జుగుప్సతో వళ్ళు జలదరించింది.

సరళ కళ్లు తుడుచుకోవటం చూడగానే సూర్యం కోపం నీళ్లకారిపోయింది.

"నన్ను క్షమించు సరళా! ఆ పశువు ప్రవర్తన గురించి అట్టే బాధపడకు"

"ఛీ! ఏమిటి బావా అందుకంతగా బాధపడతావు?"

సూర్యం మాట్లాడలేకపోయాడు. సిగ్గుతో తలఎత్తలేకుండా వున్నాడు.

"అక్కయ్య తప్పుకూడా ఏమీలేదు. అది స్త్రీ సహజమైన గుణమే! తన భర్త తననే ప్రేమించాలనుకోవడంలో తప్పులేదు. ఒకప్పుడు నీవు నన్ను వివాహం చేసుకోవాలనుకున్న విషయం తెలిసిన ఆమె ఈర్ష్యపడటంలో ఆశ్చర్యం ఏమీలేదు. నువ్వు నామీద చూపించే అభిమానాన్ని ఆమె అపార్థం చేసుకుంది"

సూర్యం మౌనంగా వుండిపోయాడు.

"నేను ఇక్కడ వుండటం మీద్దరికీ మంచిదికాదు బావా? నా కారణంగా నీ సంసారంలో కల్లోలం తేవటం నేను భరించలేను. అందుకే నీకు తెలియకుండా ట్రాన్స్‌ఫర్‌కు ప్రయత్నించాను" అంది సరళ.

"ట్రాన్స్‌ఫరా? ఎక్కడికి?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది శాంతమ్మ.

" అవును అత్తయ్యా! హైదరాబాదుకు "

"హైదరాబాదా! అంతదూరం. పెళ్ళికాని పిల్లవు ఎలా వెళతావు? నేను వుంగీ లేనిదాంటోనే జమ అయ్యాను" కంట నీరు పెట్టుకుంది శాంతమ్మ.

"అది కానిదేశం ఎలా అవుతుంది అత్తయ్యా! మన రాజధానేగా? పైగా ఉద్యోగాలుచేసే ఆడపిల్లలు తిరక్క తప్పుతుందా? నా స్నేహితురాలు సరోజ నీకు తెల్సుగా? నాకంటే కూడా చిన్నదే. వాళ్ళ ఊరు వరంగల్. మొన్నటిదాకా ఇక్కడ వుండలేదూ? నాకేం భయంలేదు. సరోజ కూడా హైదరాబాదులోనే వుంది.

"ఏమోనమ్మా నీ ఇష్టం! నీకు మేం ఏంచెయ్య గలిగాం కనక?"

"అదేంటత్తయ్యా అలా అంటావు. కన్నతల్లికంటే ఎక్కువగా పెంచావు. నేనే చేతులారా నా భవిష్యత్తును పాడు చేసుకున్నాను. నీ కన్నబిడ్డను నీకు దూరం చేశాను. అయినా పరుషంగా ఒక్కనాడూ నన్ను నిందించలేదు"

" అన్నిటికీ అపరాధిని నేనే?" అన్నాడు సూర్యం.

"ఎలా జరగాలని వుంటే అలా జరుగుతుంది. నువ్వెందుకు బాబూ అంతగా కుంగిపోతావు" అంది తల్లి.

"పెద్దదాన్ని, ఈ వయసులో వదిలేసి వెళ్ళిపోతున్నావు. సరే! వెళ్లు! నువ్వు సుఖంగా వుండటమే నేను కోరేది" కళ్లు తుడుచుకుంది శాంతమ్మ.

"నేను ఏ కాని దేశం వెళుతున్నానని అంత బాధపడతావు అత్తయ్యా! నేను అక్కడ స్థిరపడ్డాక వచ్చి నిన్ను తీసుకెళతాను. ఇక్కడా అక్కడా వుంటూవుండొచ్చు" అంది సరళ.

"ఏనాటికైనా పెద్ద బావ కన్పిస్తాడనీ, హైదరాబాదులో వుండి వుంటాడనీ నాకు అన్పిస్తుంది. నన్ను సంతోషంగా దీవించి పంపించు అత్తయ్యా" అంది సరళ.

"అంత అదృష్టమా తల్లీ! వాడు మళ్లీ నా కళ్ళ కన్పిస్తాడని నమ్మకం లేదమ్మా!"

"అలా అనకమ్మా! అన్నయ్య తప్పక వస్తాడు!" అన్నాడు సూర్యం.

" ఎప్పుడు బయలుదేరుతున్నావ్ సరళా!" అన్నాడు సూర్యం వాతావరణంలోని బరువును తగ్గిస్తున్నట్లు.

" రేపు ఉదయం బస్‌కు "

" రేపేనా?" శాంతమ్మా, సూర్యం ఇద్దరూ ఒకేసారి అడిగారు.

" అవును! ఎల్లుండి డ్యూటీలో వుండాలి "

తెల్లవారి అందరి దగ్గరా శెలవు తీసుకొని బయలుదేరింది సరళ.

సూర్యం బస్ దగ్గరకు వచ్చాడు.

(సశేషం)

# మహాత్మా !
# నువ్వు మళ్లీ అవతరించాలి

- డాక్టర్ తంగిరాల

సరిగ్గా యిప్పటికి వంద వసంతాల క్రిందట
సామ్రాజ్యవాదుల దురాక్రమణ పొలిమేరల లోపల
భాస్కరుడు అస్తమించడానికి భయపడుతున్నప్పుడు
భారతీయులందరూ పారతంత్ర్యంలో మ్రగ్గుతున్నప్పుడు
భూమి బల్లపరుపుగా పరుచుకున్నదని కొందరైనా నమ్ముతున్నప్పుడు
చంద్రగోళాన్ని దేవునిగా భావించి పూజిస్తున్నప్పుడు
జన్మించాడు బాపూజీ పోరుబందరు పురంలో...

పునర్జన్మ నెత్తిన బుద్ధమూర్తిగా......అహింసాజ్యోతిగా......
భూలోకం శిలువమీద రెండవసారి చిగురించిన ఎర్రగులాబీగా ...
ఆత్మను శోషితం చేసుకొని మహాత్ముడయ్యాడు
అనుకున్నది సాధించాడు, స్వతంత్రభారతాన్ని తిలకించాడు
దేశవిచ్ఛిత్తికి క్రుంగిపోయాడు.
తీవ్రమైన మతకలహాలకు లొంగిపోయాడు
నూట ఇరవై యేళ్లు ఢోకాలేకుండా బ్రతుకుతానన్నవాడు
హఠాత్తుగా మతోన్మాది పిస్తోలు గుళ్లకు బలియైపోయాడు......

బాపూజీ యిప్పుడు బ్రతికుంటే
భాస్కరుడు పశ్చిమాన ఉదయిస్తుంటే
నీలి నింగిని చుక్కలు నీ చేతికి అందుతుంటే
నీలో నిరంతరం యౌవనామృతం పొంగుతుంటే
ఎక్కడా ఏడుపు వినబడకుండా వుంటే
ఎప్పుడూ పగలే వుంటే, చీకటి ఎలాంటిదో తెలియకుంటే
రాజ్యాధినేతలు యుద్ధాలు మరిచిపోతుంటే
ప్రజలందరికీ కడుపునిండా తిండీ, ఒంటి నిండా బట్టా వుంటే
బాపూజీ యిప్పుడు బ్రతికుంటే
ఈ ప్రపంచాన్ని చూసివుంటే
ఎంత బాగా వుండేదీ ?
ఎంత హాయిగా వుండేదీ ??
ఓ మహనీయమూర్తీ ! సత్యాహింసా పరిశోభిత కీర్తీ !

ఓహో......కరుణాసింధూ ! కరమ్‌చందూ ! దీనబంధూ !!
నువ్వు చెప్పుకున్నట్టుగానే నీ ఆయుర్దాయం వుంటే
నువ్వు 1989 వరకూ జీవించి వుంటే
గాడ్సే పాపపువ్రేళ్లు దురహంకారపు పిస్టల్ ట్రిగ్గర్
నొక్కకుండా వుంటే

గాంధీజీ ! నువ్విప్పుడు బ్రతికుంటే
ఎన్నెన్ని ఘోరదృశ్యాలు చూసేవాడివి !
ఎంతగా కుమిలి కుమిలి ఏడ్చేవాడివి !!
ఓ మహాత్మా......!

ఇప్పుడు ఈ భూలోకంనిండా అశాంతి మండుటెండ కాస్తోంది,
ఆకలి ఈదురుగాలి వీస్తోంది......
ఎప్పుడూ భూనభోంతరాళాలు యుద్ధ శతఘ్నులతో
దద్దరిల్లుతున్నాయి......
వియత్నాంలో కాలభైరవుడు విలయతాండవం చేస్తున్నాడు
అన్నట్టు-నువ్వు బ్రతికున్నప్పుడు సూయజ్ కాలువలో
మట్టి కట్టల మధ్య పట్టి నీళ్లు ప్రవహించేవి కాబోలు
ఇప్పుడు నిరంతరం ఫిరంగిగుళ్ల ఎత్తైన గట్టుల మధ్య
ఈజిప్షియన్ల ఇజ్రాయిలీల స్వార్థరక్తం పరవళ్లు త్రొక్కుతూ
పారాడుతోంది......
రష్యా-చైనా సరిహద్దుల్లోకూడా రణగుణ ధ్వనులు వినిపిస్తున్నాయి
అప్పుడప్పుడు నెత్తుటి మరకలు కనిపిస్తున్నాయి
'దాసేద్' వారసులు కొందరు దారుణంగా
పట్టపగలు నడివీధుల్లో
పిస్టళ్ల సూదులతో
జాత్యహంకారపు దారంతో
నీగ్రోల గుండెల్ని గులాబీ దండలుగా గ్రుచ్చుకుంటున్నారు.

నిన్ను కడుపారకన్న గుజరాత్ గడ్డమీద హిందూ ముస్లిమ్ కొట్లాటల
నెత్తుటి వాన కుండపోతగా కురుస్తోంది......
నువ్వు మనసార ప్రేమించిన హరిజనుల్ని ఈ నాటి సంఘం
హింసిస్తున్నది
నీ పరమధర్మమైన అహింస మసిమసిగా నుసిమసిగా కాలికాలి
కమురు కంపు కొడుతోంది......

చచ్చి స్వర్గాన వున్న ఓ మహాత్మా !
పిచ్చిలోకంలో బ్రతుకుతున్నాం మేం
ఈ భూగోళం యిప్పుడు భగ్గున మండుతోంది
నీ భారత దేశం అట్టుడికి పోతోంది......
అడుగడుగునా కురుక్షేత్రాలు

అన్యాయాల కీకారణ్యాలు
ఆకలి ఎడారులు......
క్షుధార్తుల విదారులు......
'అతిక్రాంత సుఖాః కాలాః
ప్రత్యుపస్థిత దారుణాః'
వ్యాసునికి వంతపలికాడు వింతగా
ఆధునిక కవివంసుడొకడు ఆవేశంలో___
గజాని కొక్క గాంధారికొడుకు గాంధీగారి దేశంలో'......

ఓ పూజ్య బాపూజీ: మా వైపు ఒక్కసారి చూడు
పాప పంకంలో కుత్తుక బంటిగా కూరుకుపోయిన మమ్మల్నికాపాడు
మధ్యలో ఆపివేసిన నీ శాంతి సూక్తుల
మధుర గీతాన్ని మళ్లీ ఆలపించు మహాత్మా !
దశ దిశల్లోనూ ఘోరకలి గచ్చ పొదలా అల్లుకుంది
దారుణాఘం సాంద్రధూమంలా క్రమ్ముకుంది

ఎటుచూసినా హింసావ్యాఘ్రం భయంకరంగా గాండ్రిస్తోంది
రక్తసిక్త జిహ్వాసర్పం అల్లల్లాడిస్తోంది
సాధువులకు నీ పరిత్రాణం కావాలి
దుష్కృతులకు వినాశం రావాలి
మహాత్మా ! నువ్వు మళ్లీ బ్రతకాలి
అహింసామూర్తీ ! నువ్వు మరోమారు జన్మించాలి

స్వార్థమార్జాలాలు కటుక్కున కొరికి వేసిన శాంతి కపోతాల
మెడలు అతికించాలి
కొనవూపిరితో కొట్టుకులాడుతున్న వాటిని మళ్లీ బతికించాలి
సత్యాహింసల సాగరాలు ఉప్పొంగాలి......
జగద్ధాత్రిని కాంతి తరంగాలతో ముంచెత్తాలి......
అజ్ఞానాంధ తమసంలో ఆశాజ్యోతి వెలిగించాలి......
మహాత్మా ! నువ్వు మళ్లీ అవతరించాలి.........!
నువ్వు మళ్లీ అవతరించాలి.........!!

# శ్రీ సరస్వతి పుణ్యక్షేత్రం "బాసర"

జగద్విఖ్యాతములై వెలయునట్టి మహా పుణ్యక్షేత్రములు మన భారతావనిలో అనేకములువున్నవి. అట్టి వాటిలో అతి ప్రాచీన పరమ పవిత్ర పుణ్యక్షేత్రమయిన శ్రీ సాక్షాత్తు శ్రీకృష్ణ ద్వైపాయనుండు పరబ్రహ్మావతార స్వరూపుడైన శ్రీ వేదవ్యాసుడు స్వహస్తములతో నవిరళ జప తపశ్శక్తుల ధారబోసి స్థాపించిన భారతీ యొక్క సైకత మూర్తిగా వెలసిన శ్రీ వాసర సరస్వతీ క్షేత్ర మొకటి.

భారత దేశములో అత్యంత ప్రాచీనములయిన శారదా లయములు ఒకటి, కాశ్మీరులో రెండవది పుష్కరమున మూడవది వాసర సరస్వతియని ప్రసిద్ధిగలదు హిందూ శాస్త్రాది సాంస్కృతిక గ్రంథములలో పేర్కొనదగిన వ్యాస లిఖిత బ్రహ్మాండ పురాణమునందు వాసర సరస్వతీ మాహాత్మ్యమును గూర్చి వ్రాయబడినట్లు తెలియుచున్నది.

మహా భారత యుద్ధము వలన వికల మనస్కుడై మన శ్శాంతి కొరకు వ్యాసుడు సమస్త మునిబృంద సమేతుడై సమస్త తీర్థములు దర్శించుచు పరమ పావన గౌతమీ తీరమునకు చేరెను. అచ్చట కదంబ వన విరాజిత కౌమారాచల ప్రాంతమున శ్రీ సరస్వతీ మాత నిరాకార రూపమున నున్నట్లు గ్రహించెను.

నిర్గుణ సగుణ సాకార నిర్వికార నిర్వికల్ప నిరాకార నిత్యసత్య చిన్మయీ త్రిగుణాఖిల చిద్విలాస సర్వగుణ గుణమయ రూప శారద మాతను గాంచి వ్యాసుని మనస్సునకు శాంతి కల్గెను. సామాన్య మానవులకు నిర్గుణారాధన అత్యంత కఠినమైనది అది గ్రహించి వేద వ్యాసుడు వారికి సులభ సాధ్యమగునట్లు సగుణ రూపిణియై భక్తుల నుద్ధరించునట్లు శ్రీ శారదమాతను ప్రార్థించెను. శ్రీ శారదా మాత ఆజ్ఞానుసారముగా వ్యాసుడు ప్రతిదినము గౌతమీ నది నుండి మూడు పిడికెడుల యిసుకను గొనివచ్చి శ్రీ శారదా మాత విగ్రహము నిర్మించెను.

వేదవ్యాసుడు సర్వముని బృందముతో ఆరాధించిన స్థల మగుటచే వ్యాసపురి అని పేరుగాంచెను. కాలానుసారముగా పరి వర్తన చెంది వాసర అని తుదకు బాసరయని పిలువబడుచున్నది.

అంతే కాక వ్యాసునిచే నిర్మింపబడిన శ్రీ మహాకాళి, మహలక్ష్మి, మహా సరస్వతి విగ్రహములతో ఈ క్షేత్రము త్రిశక్తి మయాత్మక దేవతా క్షేత్రముగా భావింపబడుచున్నది.

ప్రస్తుతము వాడుకలో నున్న కథనము ప్రకారము పదు నేడవ శతాబ్దం చివర రోహిలుల దురాక్రమణచే శ్రీ మహాలక్ష్మి విగ్రహము ధ్వంసము చేయబడినట్లు తెలియుచున్నది. శ్రీ శారద విగ్రహము నాసికాగ్ర భాగము, మరియు వక్షస్థలపు కొద్దిభాగము దెబ్బతిన్నట్లు కన్పించును. అట్టి విధ్వంసకులను శ్రీ వీరమక్కాజీ పటేల్ సమీప గ్రామముల సహాయముతో ఎదుర్కొని వారి నోడించి తదుపరి విజయ స్మారక చిహ్నముగా ప్రస్తుత దేవా లయ నిర్మాణము కావించినట్లు చెప్పుకొందురు.

భక్త వీరాగ్రణి మక్కాజీ పటేల్‌గారి శిలా విగ్రహము మందిరాంతర్భాగమున శ్రీ సరస్వతీ మాతకు ఎదురుగానున్నది. హరిహరరాయ బుక్కరాయ కాలపు శ్రీ విద్యారణ్య భారతి శంకరా చార్యుల వారి ద్వారా ప్రస్తుత మహాకాళి, మహాలక్ష్మి విగ్రహ ములు స్థాపించబడినవి. మహాలక్ష్మి విగ్రహము కాశీనుండి తేబడి నట్లు ప్రతీతి.

గుడిలో చూడదగినవి ఒకటి శ్రీ మహాకాళి విగ్రహము. ఇది ముఖ్య గుడికి సమీపముగా ఎత్తైన రాతిపైనున్న చిన్న ఆలయము. రెండవది దత్తాత్రేయుల పాదుకలు,

ఆలయమున కెదురుగా నున్న కొండమీదనున్న గుహ శ్రీ నరహరి మాల్యాయన కవీంద్రుడు తపస్సుచేసిన కారణముగా నరహరి గుహయనియు, వ్యాసగుహ యనియు, అగస్త్యగుహ యనియు అందురు.

ఆలయ ప్రాకారమునందు అత్యంత పునీతమై ప్రాచీన మైన పుష్కరిణి కలదు. దీనికి అష్టతీర్థ సరోవరమని పేరు. ఈ సరోవరమందు ఎనిమిది దిశలలో ఎనిమిది తీర్థములు కలవు. మధ్యలో శ్రీ సరస్వతీ తీర్థము కలదు.

ఈ పుష్కరిణి లోనికి గంగానది జాలు అంతర్వాహినిగా నున్నదని అందులకే ఇందులో స్నానము చేసినవారికి గంగలో స్నానముచేసిన పుణ్యఫలము లభించునని అందురు.

అగ్నిని సమీపించిన శీతల బాధ తొలగు రీతి అష్టతీర్థ పుష్కరిణిలో స్నానముచేసిన వారికి సర్వ పాపములు సకల రోగాది దుఃఖ భయములు, బాధలు తొలగి అశేషానంత శాంతి సౌఖ్యములు లభించును.

ఇట్టి సహజ నిత్యకల్యాణకారియై యొప్పుచున్న "శ్రీ వాసర సరస్వతీ క్షేత్రము" ఆంధ్రప్రదేశ్‌కును, మహా రాష్ట్రమునకు సరిహద్దుగానున్న గౌతమ నదీతీర పూర్వ భాగము నందు దాదాపు మైలు దూరమున కలదు. బాసరపురి ఆదిలాబాదు జిల్లాలోనిది.

హైద్రాబాదు–సికిందరాబాదు మన్మాడు రైలు మార్గమున నిజామాబాదు తర్వాత నాల్గవ స్టేషను బాసరు అనబడును.

ఇటీవల బాసరు స్టేషను నుండి దేవాలయము వరకు రాచబాట ఇతర ప్రయాణ సౌకర్యములకు ఏర్పరచినారు.

నిత్య పూజలు శుక్ర మంగళవారములలో విశేషాలంకారాద్యర్చనలు జరుగును దేవీ నవరాత్రులందు విశేషార్చన హవనాదులు జరుగును.

మహా శివరాత్రినాడు జాతర జరుగును. ఆనాడు వేల కొలది జనులు అనంతపునీతమైన గోదావరినదిలో స్నానంచేసి శ్రీ శారదాంబ దర్శనముచేసి జన్మరాహిత్యం గుచున్నారు

## వేదవతి

శ్రీ శారదాలయమునుండి గ్రామమునకు పోవు మార్గములో ఎడమ భాగమున ఒక కొండరాతిపై ఎత్తయిన చతురాసాశ్రి కారపు శిలాస్తంభము కనబడును దీనిని చదువులమ్మయనెదరు.

ఈ స్తంభమునకు ప్రతివైపు చెవుల నానించి వినిన నొక్కొక్కవైపు నొక్కొక్క విధమైన వేద పారాయణమువంటి ధ్వని వినబడును. దీనిని చతుర్వేదవతియని అందురు.

ఈ క్షేత్రమునకు సమీపమునమున్న రవీంద్రపురము, రేణుకాపురము, మహతీపురము, రత్నపురములలో శ్రీ ఆంజనేయ విగ్రహములు కలవు నేడన్ని పురములు కలిపి వాసరపురి ఒక పుణ్యక్షేత్రము క్రింద పరిగణింపబడుచున్నది.

వేదవ్యాసుని భక్తి చిహ్నమే శ్రీ శారదాలయము.

# జిల్లాలనుండి



ఏప్రిల్ 4వ తేదీన ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ కరీంనగర్‌లో మోడల్ వీవింగ్ కేంద్రం సందర్శించారు.





ఏప్రిల్ 3వ తేదీన కరీంనగర్‌లోని 'బాలభవన్'కు గవర్నరు శంకుస్థాపన చేశారు.

## ట్యూబెక్టమీ శిబిరానికి గవర్నరు ప్రారంభోత్సవం

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ఏప్రిల్ 3 వ తేదీన కరీంగనర్‌లో హెడ్‌క్వార్టర్స్ హిస్పిటల్‌లో మూకవుమ్మడి ట్యూబెక్టమీ శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు.

ఈ సందర్భంలో గవర్నరు మాట్లాడుతూ, స్వాతంత్ర్యం సంపాదించిన యీ యిరపయ్యేళ్ళలోనూ దేశం వివిధ రంగాలలో విశేషమైన అభివృద్ధిని సాధించినదని పేర్కొన్నారు. ఆహారోత్పత్తి రెండింతలు పెరిగిందనీ, ఆర్థికాభివృద్ధి మూడింతలు జరిగిందని అన్నారు. అయినా జనాభా విపరీతంగా పెరిగిపోవడంవల్ల జీవన ప్రమాణం మాత్రం పేరగలేదన్నారు. అందువల్ల యితర అభివృద్ధి పథకాలను అమలుచేయడంతోపాటు కుటుంబ నియంత్రణకు కూడా అధిక తర ప్రాదాన్యం యివ్వాలిని గవర్నరు విజ్ఞప్తి చేశారు.

అంతకు ముందు, గవర్నరు శ్రీ రాజ రాజేశ్వరస్వామి ఆలయాన్ని, శ్రీ భీమేశ్వరస్వామి ఆలయాన్ని సందర్శించారు. జిల్లాపరిషత్తు "వనాలకు దగ్గరలో బాలభవన్‌కు ఏప్రెల్ 3 న శంకుస్థాపన చేశారు.

ఆంధ్రప్రదేశ్ శిశు సంక్షేమమండలి తాలూకు కరీంనగర్ విషాగంవారు ఈ భవనాన్ని నిర్మిస్తున్నారు.

## కరీంనగర్‌లో గాంధీ శతజయంతి మ్యూజియం భవనం

ఏప్రిల్ 6 వ తేదీన కరీంనగర్‌లో మ్యూజియం భవనంలో జరిగిన ఒక కార్యక్రమంలో కరీంనగర్ జిల్లా కలెక్టరు శ్రీ ఎస్. వి. సుబ్రమణ్యం, మ్యూజియం భవనాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురాతత్త్వ శాఖ డైరెక్టరు శ్రీ వహీద్‌ఖాన్‌కు అప్పగించారు. ఈ భవన నిర్మాణానికి రూ. 60,000 ఖర్చయ్యాయి.

## కరీంనగరంలో ప్రాంతీయ అభివృద్ధి పథకం ప్రపంచబ్యాంకు సభ్యులచే పరిశీలన

ప్రపంచ బ్యాంకు సభ్యులు ఏప్రిల్ 13 వ తేదీన జగత్యాలకు వచ్చి అక్కడ వ్యవసాయ శాఖ జాయింటు డైరెక్టరు శ్రీ వెంకటరత్నం, కరీంనగరం వ్యవసాయ డిప్యూటీ డైరెక్టరు శ్రీ గులాం అహమద్‌తో పోచంపాడు ప్రాజెక్టు క్రింద ప్రాంతీయ అభివృద్ధి పథకం, భూసార పరిరక్షణ చర్యలను గురించి చర్చలు జరిపారు. సర్వశ్రీ ఆగ్రో ఇండస్ట్రీస్ కార్పొరేషన్ డైరెక్టర్ శ్రీ బి. యన్. రామన్ జిల్లా కలెక్టరు శ్రీ యన్. వి. సుబ్రహ్మణ్యం, సబ్-కలెక్టరు శ్రీ ఆర్. వైద్యనాథ్ అయ్యర్, ఇతర అధికారులు కూడా ఈ చర్చలలో పాల్గొన్నారు



కరీంనగర్ ఆసుపత్రిలో ఏప్రిల్ 8వ తేదీన ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ట్యూబెక్టమీ శిబిరానికి, ట్రిపిక్ యాంటిజెన్ కార్యక్రమానికి ప్రారంభోత్సవం చేశారు



గుంటూరు జిల్లాలోని పెదపల్లి ముగుగుదల సైఫన్‌కు చేనేత పరిశ్రమ శాఖామాత్యులు శ్రీ ఎ. భగవంతరావు మార్చి 22వ తేదీన శంకుస్థాపన చేశారు



హోంశాఖా మాత్యులు శ్రీ జె. వెంగళరావు ఏప్రిల్ 4వ తేదీన నెల్లూరు జిల్లా పరిషత్ హాలులో జరిగిన సభలో ప్రసంగిస్తున్న దృశ్యం

## వర్ధన్నపేటలో మంచినీటి సరఫరా పథకానికి ప్రారంభోత్సవం

ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావు ఏప్రిల్ 9వ తేదీన వరంగల్ జిల్లాలోని వర్ధన్నపేటలో రూ. 7.34 లక్షల వ్యయంతో నిర్మించిన రక్షిత మంచినీటి సరఫరా పథకానికి ప్రారంభోత్సవం చేశారు,

ఈ సందర్భంలో ఏర్పాటైన బహిరంగ సభలో ఉపముఖ్యమంత్రి మాట్లాడుతూ, 1966 లో చేపటిన 58 పథకాలలోనూ యీ పథకం ఒకటనీ, మొట్టమొదట చేపటిన 18 పథకాల్లో ఇది చేర్చబడినదనీ చెప్పారు. ప్రజల అవసరాలను దృష్టిలో వుంచుకుని యీ రకమైన అభివృద్ధి కార్యక్రమాలకు ఒకదాని తర్వాత ఒకటి ప్రాధాన్య క్రమంలో చేపట్టడం అవసరమని పేర్కొన్నారు. ఇటువంటి పథకాలు చేపట్టిన చోట్లలో విద్యుచ్ఛక్తి మాదిరిగానే మంచినీటి సరఫరాకుకూడా హరిజనవాడకు అధిక ప్రాధాన్యం యివ్వాలని ఆయన తెలియజేశారు.

## యాచారం గ్రామంలో బీదలకు పట్టాల పంపిణీ

హైదరాబాదు జిల్లాలోని ఇబ్రహీం పట్నం తాలూకాలోగల యాచారం గ్రామంలో భూమిలేని బీదలకు ఏప్రిల్ 2 వ తేదీన పంచాయతీరాజ్ మంత్రి శ్రీ తోట రామస్వామి పట్టా సర్టిఫికెట్లను పంచిపెట్టారు.



రాజమండ్రి దగ్గర కొత్తపల్లి వద్దగల బారాదకాల్వ మీద వంతెన దృశ్యం ఏప్రిల్ 14వ తేదీన ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావు వంతెనకు ప్రారంభోత్సవం చేశారు.

ఈ సందర్భంలో పంచాయతీరాజ్ మంత్రి మాట్లాడుతూ, యీ విధంగా పట్టాలను పంపిణీ చేయడం రాజకీయ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని కాదనీ, సమాజంలో ఆర్థికంగానూ, సాంఘికంగానూ మార్పును తీసుకురావాలనే లక్ష్యంతో అట్టడుగు బీద ప్రజల ప్రయోజనాలను కాంక్షించేననీ పేర్కొన్నారు.

బంజరను ఆక్రమించుకున్న భూస్వాములనుంచి ఆ భూముల్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడానికి ప్రభుత్వం అన్ని చర్యలూ తీసుకుంటున్నదని మంత్రి తెలియజేశారు.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి ప్రారంభోత్సవం

రాష్ట్ర రెవిన్యూ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి శ్రీకాకుళం జిల్లా కంతలి గ్రామంలో ఏప్రిల్ 11 న ప్రాథమిక ఆరోగ్య కేంద్ర భవనానికి ప్రారంభోత్సవం చేశారు.

ఈ భవన నిర్మాణానికి శ్రీమతి యం. సత్యవతమ్మగారు రూ. 10,000 లు రెండెకరాల భూమిని విరాళంగా ఇచ్చారు.

మంత్రి రాష్ట్ర అభివృద్ధిని గురించి మాట్లాడుతూ వ్యవసాయం పరిశ్రమలు అభివృద్ధి పరచడానికి నాగార్జునసాగర్, శ్రీశైలం, కొత్తగూడెం, బలిమేలవంటి ప్రాజెక్టులు చేపట్టడం జరిగిందని చెప్పారు. బంజరుభూములేకాక, చెట్లులేని అడవి భూములు కూడా పేదలకు పంచిపెట్టడం జరుగుతుందని ఆయన చెప్పారు. సంఘవిద్రోహక శక్తులను అరికట్టడానికి సేవా దళములు రక్షకదళములు ఏర్పాటు చేయవలసిందని యువకులకు అభ్యర్థన చేశారు. ఈదళాల నిర్వహణకు ధనసహాయం చేయ వలసిందని శ్రీమంతులను కోరారు. ఈ సమావేశానికి శ్రీ టి. పాపారావు, యం. యర్. ఎ., అధ్యక్షత వహించారు. శ్రీ సి. హెచ్. సత్యనారాయణ, యం. యల్. ఏ., జిల్లాపరిషత్తు ఛైర్మన్ శ్రీ జి. శ్రీరాములు నాయుడుగారలు కూడా మాట్లాడారు. శ్రీ సి. హెచ్. శ్యామలరావు కృతజ్ఞతాభివందనలు చేశారు.

## ప్రజల సహకారంతోనే సంక్షేమరాజ్యం స్థాపించబడుతుంది మహిళా సంక్షేమ మంత్రి ఉద్ఘాటన

సంక్షేమ రాజ్య స్థాపనకేవలం ప్రభుత్వం ఒకటే చేసేపని కాదునీ, ప్రజల సహకారంతోనే అది నెలకొల్పబడుతుందనీ ప్రజలు ముందుకొచ్చి తమ అంధ దండలను అందజేయాలనీ, మహిళా మండలుల సభ్యులు కూడా ఈలక్ష్యసాధనకు పరిశ్రమించా లనీ మహిళా సంక్షేమం, యాత్రిక విషయాల మంత్రి శ్రీమతి రోడామిస్త్రీ అన్నారు. ఏప్రిల్ 7వ తేదీన అనకాపల్లిలో బాలల గృహాన్ని సందర్శించిన సందర్భంలో ఏర్పాటు చేయబడిన సమావేశంలో యువిషయాన్ని మంత్రి పేర్కొన్నారు. బాలలగృహంలో ఆశ్రయంపొందుతున్న వారికి శ్రీమతి రోడామిస్త్రీ వస్త్రాలను పంపిణీచేశారు. అనంతరం, పిల్లలు సాంస్కృతిక ప్రదర్శనలు యిచ్చారు.

## విద్యుచ్ఛక్తి సరఫరా పథకానికి ప్రారంభోత్సవం

చిన్నతరహా సేద్యపు నీటి పారుదలశాఖామంత్రి శ్రీ వి. పురుషోత్తమరెడ్డి ఎప్రిల్ 12వ తేదీన, నల్గొండజిల్లా, మోతుకూరు పంచాయతీ సమితిలోని కంచనపల్లి గ్రామంలో వీధి టిపోలకు ప్రారంభోత్సవం చేయడం ద్వారా విద్యుచ్ఛక్తి సరఫరా పథకాన్ని ప్రారంభించారు. ఈ కార్యక్రమాన్ని అనేకమంది గ్రామ ప్రజలు ఆనందోత్సాహాలతో తిలకించారు. మోతుకూరు పంచాయతీ సమితిలో విద్యుచ్ఛక్తి సరఫరా కార్యక్రమం చురుగ్గా అమలు జరుగుతున్న 18 గ్రామాలలో కంచనపల్లి కూడా ఉంది.

మంత్రి యీ సందర్భంలో ప్రసంగిస్తూ రైతులు విద్యుచ్ఛక్తిని వినియోగించుకొని తమపొలాలలో ఉత్పత్తిని రెట్టింపు చేయాలని ఉద్బోధించారు. తొలుత సమితి అధ్యక్షుడు శ్రీ తిరుమలరెడ్డి మంత్రికి స్వాగతం చెప్పారు. తర్వాత ఆయనను గ్రామంలోనికి ఊరేగింపుతో తీసికొని వెళ్లారు. అనేక మంది అధికార, అనధికార ప్రముఖులు కార్యక్రమానికి హాజరయ్యారు.

## గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

శాసనసభ్యుడు, శ్రీ కె. సుదర్శనరెడ్డి గత సోమవారం నాడు వరంగల్లు జిల్లా నరసంపేట పంచాయతీ సమితిలోని తోపనపల్లిలో విద్యుచ్ఛక్తి సరఫరాకు ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా జరిగిన సమావేశంలో విద్యుచ్ఛక్తి శాఖ అసిస్టెంట్ ఇంజనీరు శ్రీ మోహన్‌రావు ప్రసంగిస్తూ తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి కార్యక్రమం క్రింద చేపట్టిన యీ పనిని 15 రోజులలో పూర్తి చేసినందుకు సిబ్బందిని ప్రజలను అభినందించారు. ఈ పథకం అమలుకు లక్ష రూపాయలు ఖర్చు అవుతాయని అంచనా వేశారనీ, సమితిలోని 67 గ్రామాలలో 35 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడిందనీ ఆయన వెల్లడించారు. రాకపోకల సౌకర్యాలు సరిగా లేకపోయినప్పటికీ నిర్ణీత వ్యవధిలో పనిపూర్తి చేయడంలో ఉత్సాహం, నైపుణ్యం చూపిన పనివారలకు శ్రీ కె. సుదర్శనరెడ్డి బహుమతులు ఇచ్చారు.

## వెసక్టమీ ఆపరేషనులు

వరంగల్‌జిల్లా కొడకండ్ల పంచాయతి సమితిలో గత మార్చి నెలలో పాలకుర్తి ప్రాథమిక ఆరోగ్య కేంద్రం వైద్య శాఖాధికారి, డా॥ పి. వెంకటయ్య తన సిబ్బంది సహకారంతో 22 వెసక్టమీ ఆపరేషనులు చేశారు.

## బెస్తలకు నూలు సరఫరా

శ్రీకాకుళం జిల్లా కోట బొమ్మలి పంచాయతి సమితి అధ్యక్షులు శ్రీ చిన్నికృష్ణ నాయుడు, బి. డి. ఓ. శ్రీ కె. యన్ పట్నాయక్ ఆ సమితిలోని 13 బెస్త గ్రామాల్లో 242 మంది బెస్తలకు రూ. 6,000 విలువచేసే నూలుదారం పంపిణీ చేశారు. గత మార్చి నెలలో తుఫానుకు గురియైన బెస్తలకు వలలు మరమ్మతు చేసుకోవడానికి వీలుగా ఈ నూలు సరఫరా చేయడం జరిగింది.

## బావుల త్రవ్వకానికి డబ్బు మంజూరు

మెదక్ జిల్లా దుబ్బాక పంచాయతీ సమితి సాయి సంఘం సమావేశం యిటీవల అధ్యక్షుడు శ్రీ రామచంద్రారెడ్డి అధ్యక్షతన జరిగింది. ఆ సందర్భంలో బావుల త్రవ్వకం కొరకు రూ. 30,000ల మొత్తాన్నీ, ఆయిల్ ఇంజన్లు, ఎలక్ట్రిక్ మోటార్లు కొనుగోలు నిమిత్తం రూ. 20,000ల మొత్తాన్నీ మంజూరుచేశారు.

హరిజనులకోసం నివేశన స్థలాలను సేకరించే కార్యక్రమం క్రింద జరిగిన కృషిని స్థాయీ సంఘం సమీక్షించి భూంపల్లి, అందె, ఎంగుర్తి గ్రామాలలో హరిజనుల కొరకు నివేశన స్థలాలను సేకరించడానికి సంబంధించిన ప్రతిపాదనలను ఆమోదించింది.

తెలంగాణా అభివృద్ధి పథకం క్రింద బ్లాకులో చేపట్టిన చిన్న తరహా సేద్యపు నీటి పారుదల పనులను స్థాయీ సంఘం నిశితంగా సమీక్షించి పునరుద్ధరణకు సంబంధించిన పనులకు రూ. 37,400 లనూ, చెరువుల నిర్వహణకొరకు రూ. 10,230 లనూ మంజూరు చేసింది.

వివిధ పథకాలకు సంబంధించిన పనుల విషయంలో సాధించిన పురోభివృద్ధిపట్ల సమితి అధ్యక్షుడు సంతృప్తి వెలిబుచ్చారు. గ్రామస్థుల అవసరాలను దృష్టిలో పెట్టుకొని ఈ యేడాది ఖరీఫ్ ప్రణాళికను రూపొందించాలని ఆయన సర్‌పంచ్‌లకూ, విస్తరణాధికార్లకూ విజ్ఞప్తి చేశారు.

## నిర్మల్‌లో గ్రామీణ మంచినీటి సరఫరా పథకం

నిర్మల్ పంచాయతీ సమితి స్థాయీ సంఘం సమితి చైర్మన్ శ్రీ నరసింహారెడ్డి అధ్యక్షతన యిటీవల సమావేశమై గ్రామీణ మంచినీటి సరఫరా పథకంక్రింద 11 మంచినీటి బావుల్ని త్రవ్వేందుకుగాను రూ 47 200 లను మంజూరు చేసింది. ఇంతవరకు యీసమితిలో 265 మంచినీటి బావుల్ని త్రవ్వడంజరిగింది. దీనిలో కొంతవరకు కరువు పరిస్థితుల్ని తట్టుకోవడానికి వీలు ఏర్పడింది.

## ఉగాదినాడు గిరిజనులకు నూతనవస్త్రాల పంపిణీ

తెలుగు సంవత్సరాదిని పురస్కరించుకుని శ్రీకాకుళం జిల్లాలోని ఎల్విన్‌పేట్‌లో గల జన సంక్షేమ విభాగం ప్రత్యేక డిప్యూటీ కలెక్టరు ఏప్రిల్ 7 వ తేదీన భద్రగిరిలో గిరిజనులకు విందు ఏర్పాటుచేశారు. దీనికి ఏజన్సీ ప్రాంతంలోని గిరిజనులకు విందు ఏర్పాటుచేశారు దీనికి ఏజన్సీ ప్రాంతంలోని మారుముల చోట్లనుంచి కూడా మొత్తం 9.600 గిరిజనులు హాజరయ్యారు. ఈ సందర్భంలో 2 గిరిజన మహిళలకు 2.640 చీరలను, పురుషులకు 2.698 ధోతీలను, పిల్లలకు 663 జతల బట్టలను పంపిణీ చేశారు.

ఇందుకుగాను శ్రీకాకుళం జిల్లా కలెక్టరు శ్రీ బి. ఎన్. యుగంధర్ 1 లక్ష రూపాయలను మంజూరు చేశారు ఇంత పెద్ద ఎత్తున యీ విధమైన విందు ఏర్పాటు, వస్త్రాల పంపిణీ జరగడం యిది రెండోది, మొదటిది రిపబ్లిక్ దినోత్సవాల సందర్భంగా ఏర్పాటు చేయబడింది.

## వీధిదీపాలకు ప్రారంభోత్సవం

చిత్తూరు జిల్లాలోని మదనపల్లి పంచాయతీ సమితికి చెందిన, బాడికాయలపల్లి గ్రామంలో వీధిదీపాలకు శాసనసభ ప్రతినిధి శ్రీ ఎ. నరసింగరావు ఇటీవల ప్రారంభోత్సవం చేశారు ఈ కార్యక్రమానికి పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ ఆర్. భాస్కరరెడ్డి అధ్యక్షత వహించారు.

డివిజనల్ ఎలక్ట్రికల్ ఇంజనీరు శ్రీ డి. రామస్వామిరెడ్డి ఈ సందర్భంలో మాట్లాడుతూ. వ్యవసాయోత్పత్తులను పెంచడానికిగాను సేద్యపు నీటి బావులకు విద్యుచ్ఛక్తి కనెక్షన్లను యివ్వడంలోనూ, హరిజన వాడల్లో వీధి దీపాల ఏర్పాటుచేయడంలోనూ అధిక ప్రాధాన్యం యిస్తున్నట్టు తెలియజేశారు.

## పుంగనూరు తాలూకాలో బంజర్ల పంపిణీ

చిత్తూరు జిల్లాలోని పుంగనూరు తాలూకాలో భూములేని 2 651 బీదలకు 6 730 ఎకరాల బంజరు భూమిని పంపిణీచేశారు. భూములు లభించినే వారిలో 40 మంది హరిజనులు, 66 మంది షెడ్యూలు తెగలవారుకూడా వున్నారు.

## వికలాంగులకు వృత్తి పునరావాస కేంద్రం

1970 మార్చినెలలో 23 మంది వికలాంగులు హైద్రాబాదులోని వికలాంగుల వృత్తి పునరావాస కేంద్రానికి వచ్చి తమ వృత్తికి సంబంధించిన విషయాలను గురించి సలహాలు పొందారు. వీరిలో 6 మంది మహిళలుకూడా ఉన్నారు. ఈ 23 మందిలో 19 మందిని వృత్తి విద్యా శిక్షణకై యీ కేంద్రంలో చేర్చుకోబడినారు. ఇంతవరకు యీ కేంద్రానికి 259 వికలాంగులు. 60 మంది చెవిటి మూగవారు 32 మంది అంధులు చేర్చుకోబడినారు.

1970 మార్చిలో 8 మంది వికలాంగులకు వీరిలో ఒక మహిళకూడా ఉంది ఉద్యోగవసతి కల్పించబడింది.

ఈ కేంద్రం మొత్తంమీద 565 మంది వికలాంగుల తల్లిదండ్రులకు సంరక్షకులకు తగిన సలహాలిచ్చింది.

## అమీన్‌పూర్‌లో పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం

పంటచెరు సమితిలోని అమీన్‌పూర్ గ్రామంలో మూడు గదుల పాఠశాల భవనానికి మెదక్ జిల్లా కలెక్టరు శ్రీ ఎస్. చక్రవర్తి ఇటీవల ప్రారంభోత్సవం చేశారు.

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION, PUBLIC RELATIONS AND TOURISM, ANDHRA PRADESH, HYDERABAD
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GO'/ERNMENT CENTRAL PRESS, HYREDABAD

# ఆంధ్రప్రదేశ్ గురించి...

* ఆంధ్రప్రదేశ్ జనాభా భారతదేశ జనాభాలో 8 శాతానికి, ఆంధ్ర ప్రదేశ్ విస్తీర్ణం భారతదేశ విస్తీర్ణంలో 9 శాతానికి సమానం.
* ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం 1,06.052.4 చదరపు మైళ్లు.
* 1961 లో సేకరించిన లెక్కల ప్రకారం, ఆంధ్రప్రదేశ్ జనాభా, 3,59,83,447 మంది.
* 1961 లెక్కల ప్రకారం, అక్షరాస్యుల శాతాన్నిబట్టి, ఆంధ్రప్రదేశ్ భారతదేశ రాష్ట్రాలలో పదవ స్థానం ఆక్రమించింది.
* 1961 లెక్కల ప్రకారం, రాష్ట్ర జనాభాలో అక్షరాస్యులు 21.2 శాతం మంది వున్నారు. కాగా భారతదేశం మొత్తంమీద వున్న అక్షరాస్యుల శాతం 24.0.
* 1961 లో, హైదరాబాదు, కృష్ణా, పశ్చిమగోదావరి, గుంటూరు, తూర్పుగోదావరి జిల్లాలలో అక్షరాస్యులు, అఖిల భారత స్థాయికంటే ఎక్కువ మంది వున్నారు.
* రాష్ట్రంలో తలసరి సగటు ఆదాయం (1960-61 నాటి ధరలు) మొదటి ప్రణాళిక అంతానికి రూ 281లు, రెండవ ప్రణాళిక అంతానికి రూ. 306లు, మూడవ ప్రణాళిక అంతానికి రూ. 333ల చొప్పున ఉంది. నాలుగవ ప్రణాళిక ముగింపు నాటికి తలసరి సగటు ఆదాయం రూ. 430 లకు పెరుగుతుంది.
* రాష్ట్రంలో 1 000 అడుగుల లోతు మేరలో సుమారు 1,000 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు వున్నాయి. 2 000 అడుగుల లోతు మేరలో 1,320 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు లభించగలవని అంచనా.
* భారత దేశంలో, బారైట్స్ వుత్పత్తిలో ఆంధ్రప్రదేశ్ దే అగ్రస్థానం. దేశంలో వుత్పత్తి అయ్యే బారైట్స్‌లో 90 శాతం మొదలు 95 శాతం వరకు రాష్ట్రంలో వుత్పత్తి అవుతున్నది.
* అభ్రకం వుత్పత్తిలో బీహారు, రాజస్తాన్ రాష్ట్రాల తరువాతి స్థానం ఆంధ్రప్రదేశ్ ది.

